సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 45
సంచిక 39
**27.5-53**

విజయ వైశాఖ శుద్ధ చతుర్దశి; బుధవారం



కుతుబ్ మినార్
ఫొటో—శ్రీ సి. సీతారాం, (మద్రాసు).

# కాలక్షేపం

భూషలుగావు మర్త్యులకు
భూరిమయాంగద తారహారముల్,
భూషిత కేశ పాశమృదు-
పుష్పసుగంధ జలాభిషేకముల్;
భూషలుగావు పూరుషుని
భూషితుజేయు బవిత్రవాణి; వా
గ్భూషణమే సుభూషణము;
సంభూషణముల్ నశియించునన్నియున్.

తా॥ భుజకీర్తులుగాని, తారహారములుగాని, జుట్టుముడియందు ఉంచుకోబడిన మృదువైన పుష్పములుగాని, సువాసనద్రవ్యములుగాని, స్నానముచేసి శుచిగానుండుటగాని, మానవులకు నిజమైన అలంకారములు కాజాలవు. పరిశుద్ధమైనవాక్కు (అనగా చక్కని వాక్శుద్ధి) ఒక్కటే సరియైన భూషణం. అది ఒక్కటే మానవునకు సరియైన అలంకారము. అటువంటి అలంకారము ఉన్నప్పుడు మిగిలిన భూషణములన్నియు అప్రశస్తములై పోవును.

తల్లీ! నిన్ను దలంచి పుస్తకము
చేతంబూనితిన్; నీవు నా
యుల్లంబందున నిల్చి, జృంభణముగా
నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను
సంప్రీతిన్ జగన్మోహినీ!
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ!
పూర్ణేందు బింబాననా!

తా॥ తల్లీ నిన్ను ధ్యానించుకొని గ్రంథం ప్రారంభించాను. నీవు నా హృదయంలోనే ఉండి బాహాటంగా చక్కని మాటలతో నానోటివెంట మంచి వాక్యాలు పల్కించుము. ఓ జగన్మోహినీ! ఓ వికసితపద్మాక్షీ! ఓ సరస్వతీ! ఓజగన్మాతా! నిండైన చంద్రునివంటి ముఖముగలదేవీ!

అని సరస్వతీప్రార్థన చేసి చదువు ప్రారంభించడం మంచిదీ. చక్కని సరస్వతీప్రార్థన తేటతెనుగు తేనెలొలుకునట్లుగా బమ్మెరపోతరాజుగారు యీ పద్యాన్ని ఆలాపనచేశారు. పోతన్నగారికి బావమరది వరుసవాడై ఆయనతో సరసము లాడినటువంటి శ్రీనాథ మహాకవి కూడా "సకల సద్గుణ నికురంబ శారదాంబ" అనే సరస్వతీ స్తవం చేసి, తన కవిత్వమునకు మంచి పటుత్వము నిచ్చి సభలలో తనకు మెప్పు కలిగేటట్లు చేసి, తనకు రాజసభలలో కనకాభిషేకములు చేయించవలసినది ప్రార్థించాడు. ఈ సరస్వతీ స్తవం ఎందుకు చేసినాడయ్యా అంటే లక్ష్మీ ప్రసన్నంకోసం. "దీనారటంకాలదీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల" అనే చరణంతో శ్రీనాథుడు పద్యం ప్రారంభించాడు. దీనారములు, టంకాలు అనేవి ఆనాటి బంగారు నాణెములు. దీనారం అంటే బహుశః వరహాతో సమానంగా ఉండవచ్చు. వరహా అంటే రూ 4 లకు సమానము. కాబట్టి ఆ దక్షిణాధీశుని ముత్యాలశాలలో శ్రీనాథమహాకవి యొక్క అనర్గళమైన పాండిత్యానికిన్నీ, కవిత్వధారాశుద్ధికిన్నీ మెచ్చి వరహాలు మొహరీలతో కనకాభిషేకం చేశారు. అటువంటి కనకవర్షాలు ఇంకా కావాలని ఆ కవిసార్వభౌముడు కలువరించి యీ సరస్వతీ ప్రార్థన చేశాడు.

తాను మనస్సులో కోరింది లక్ష్మీ కటాక్షం-కాని, తాను ప్రార్థించినది సరస్వతీ దేవిని. కేవలం లక్ష్మీకటాక్షమే కావలసినవాడు లక్ష్మీస్తోత్రమే చేసి, లక్ష్మీ ఉపాసనమాత్రమే చేయక, యీసరస్వతీ ప్రార్థనలు చేయడం ఎందుకు? చల్లకువచ్చి ముంత దాచడం ఎందుకు? చిత్తం శివునిమీద భక్తి చెప్పులమీద అన్నట్లుగా ఉంది. కాని, యిక్కడే పండితులు ఖండితంగా ప్రవర్తించలేకపోయినారు? - ద్రవ్యాశచేత సాహిత్యంలో సాధకంచేశారు. ద్రవ్యాశచేతనే తర్కవ్యాకరణ పండితులైనారు. భుక్తికోసం విద్వత్కవులైనారు. కేవలం భుక్తికోసమే కాదు. రాజులతో సరిసమానంగా అర్థాసనములు స్వీకరించి సభామర్యాదలు పొంద

దాసు వామన రావు

## విషయానుక్రమణిక

వలెననే ఆశతోను, రాజులతోబాటు కవిరాజులుకూడా గజారూఢులై ఊరేగవలెననిన్నీ, అగ్రహారాలు సంపాదించి అష్టయిశ్వర్యాలు తామరతంపరగా అనుభవించవలెననిన్నీ కవితిల్లజులు మనసారా వాంఛించి సరస్వతీఉపాసన చేశారు.

విద్వాంసుడైనవానికి ప్రభువులైనవారు సన్మానములు చేసి గౌరవించకపోతే, "ఆ వికృతిపు జాడ్యమాదోరది; విత్తములేకయె వారు పూజ్యుల; అంధకజన దూషితంబులు ఘనంబులు గావె అమూల్యరత్నములో?" అన్నాడు భర్తృహరివంటి మహాపండితుడు. ఇటువంటి పద్యం చెప్పిన భర్తృహరి, ఇటువంటి శ్లోకాలు చెప్పిన భర్తృహరి మహాకవియనుటకు సందేహము లేదు ఆయన మాటుకు ఆయన అమూల్యరత్నమే. నోబిల్ బహుమానం పొందిన రవీంద్రనాథటాగూరువలె సన్మానం పొందవలసినవాడు. కాని, ఆయన కాలంలో ఆయన తనకు అటువంటి అనుకూలపరిస్థితులు ఉన్నట్లుగా తన సుభాషితంలో చెప్పుకోలేదు.

"బోద్ధలగువారు మత్సర పూర్ణమతులు
ప్రబల గర్వవిదూషితుల్ ప్రభువులెన్న
నితర మనుజులబోధోపహతులు గాన

భావమున జీర్ణమయ్యె సుభాషితంబు."

అన్నాడు. ఆనాడు భర్తృహరివంటి మహాకవి రచించిన వజ్రపుతునకవంటి సుభాషిత గ్రంథమును ప్రభువులకు సమర్పించి ద్రవ్యం సంపాదించడానికి అవకాశం లేకపోయింది. కారణం ఏమిటంటే "ప్రభువులు గర్వపోతులు" అన్నాడు. పోనీ, ఆ గ్రంథాన్ని సామాన్యజనానికి సమర్పించి మెప్పు పొందుదామా అంటే, ప్రజలు వట్టిపామరులు. పండితమండలికి సమర్పిద్దామా అంటే, ఇంకొకడు గొప్పకవియై పేరుప్రతిష్ఠలు సంపాదించడం కవులకు యిష్టం లేదు. ఇంకొకరిమేలును ఓర్వలేని అసూయాగ్రస్తులు పండితులు. ఈవిధంగా లోకం ఉండడంచేత భర్తృహరివంటిమహాపండితుని "సుభాషితం" అనే మహాగ్రంథసారం అంతా ఆయన మనస్సులోనే జీర్ణించిపోయి ఉన్నదట

ఆ కాలంలో అచ్చుయంత్రాలు లేవు ఒక చక్కని గ్రంథం రచిస్తే దానికి లక్షల కొలది ప్రతులను అచ్చువేసి, పుస్తకాల వ్యాపారంచేసి అమ్ముకోగలపుస్తక వ్యాపారస్తులు లేరు అందువల్ల గ్రంథములను రచించి, వాటిని పుస్తక వ్యాపారస్తులకు సమర్పించి, సర్వస్వామ్యములను గ్రంథకర్త తనకే ఉంచుకొని, "ఈ నాటకమును అంతాగాని, కొంతగాని, మా అనుమతి లేకుండా ఎవరైనా ముద్రిస్తే, సమస్తమైన క్రిమినలు సివిలు చర్యలకు బాధ్యులు కాగలరు" అని బాహాటంగా గ్రంథకర్త తన అధికారం అందరికీ వెల్లడి అయ్యేటట్లుగా శిలాశాసనం చెక్కించి పాతించవచ్చు.

ఒక గ్రంథకర్త చక్కని జావళీలు కొన్ని రచించాడు. ఈయన రచించిన జావళీలు భోగం మేళములలో చాలా జనరంజకంగా ఉంటూ ఉండేవి. ఇతనిచే రచింపబడిన జావళీల గ్రంథాల ప్రతులు రైలుబండ్లలో విశేషంగా విరివిగా అమ్మబడుతూ ఉండేవి. ఆ పుస్తకములను అమ్మేటటువంటి పుస్తకముల ఏజంట్లు రైళ్ళలో ఆ పాటలను మనోహరంగా పాడి వినిపించిన పిమ్మట, చాలామంది ప్రయాణీకులు ఆ జావళీగ్రంథ ప్రతులను కొనుక్కొంటూ ఉండేవారు. ఈ గ్రంథకర్తకు యీ పుస్తకాల అమ్మకంవల్ల చాలా ద్రవ్యం వచ్చింది భోగంమేళము ఏదైనా గజ్జెకట్టి మేజువాణీ చేసినట్లయితే, యీ కవి రచించిన జావళీలను పాడవలసినదిగా సభికులు కోరేవారు అటువంటి మేజువాణీచేసిన భోగంమేళానికి నూటపదహార్లు మొదలుకొని ఎంతయినా సమర్పించేవారు ఈవిధంగా యీ భోగం మేళాలు యీ జావళీలతో ద్రవ్యార్జన చేస్తున్నారనే విషయం గ్రంథకర్త గ్రహించాడు. వెంటనే ఒకప్రకటనచేశాడు "నా అనుమతి లేకుండా, ఏ ఊరిలోనైనా ఏ భోగం మేళం అయినా పబ్లికుగా చేసేటటువంటి మేజువాణీలయందు నా జావళీలను నా అనుమతి లేకుండా పాడిన యెడల ప్రాసిక్యూషను చేయబడుదురు. నాకు నష్టపరిహారము యివ్వవలసిన బాధ్యులగుదురు నాచే జరుపబడగల యావత్తు సివిలుక్రిమినలు వ్యవహార చర్యలకు బాధ్యులగుదురు." అని ప్రకటనచేశాడు. ఈ ప్రకటన చూచిన మీదట చాలా భోగంమేళాలు ఆ జావళీలను పాడడం విరమించాయి.

ఈ విధంగా అచ్చుయంత్రాలు వచ్చిన తర్వాత కవులకు ద్రవ్యాశ హెచ్చింది. తమ గ్రంథాలు వ్యాప్తిలోకి రావాలనే ఆశతో బాటు, తమకు ఆ గ్రంథాల వల్లను, తాము రచించిన నాటకాల వల్లను, పాటలవల్లను డబ్బు సమృద్ధిగా రావాలనే ఆశ బాగా కలిగింది. తమ పాటను గ్రామఫోను రికార్డులలోకి ఎక్కిస్తే అందువల్ల గ్రామఫోను కంపెనీవారు ఆ రికార్డులను అమ్మి లాభాలు గడిస్తారు గనుక, ఆ లాభాలలో తమకుకూడా ఒక చాతుర్భాగం రావాలన్నారు తమ రాయల్టీ (రాజభాగం) తమకుయిస్తేనే తప్ప ఆ పాటను గ్రామఫోను రికార్డులలోకి ఎక్కించడానికి ఆపాటను రచించిన రచయిత అనుమతి యివ్వడు. ఈ రీతిగా "మా అనుమతి లేకుండా మా నాట

# ★ కాలక్షేపం ★

కాలు ప్రదర్శించినవారున్నూ, మాపాటలు పబ్లికుగా పాడినవారున్నూ, మా గ్రంథాలను పబ్లికుగా పురాణ కాలక్షేపంగా చదివి ధనమార్జించినవారున్నూ, అటువిడుతరాలూ, ఇటు ఏడు తరాలూ రౌరవాది మహా నరకముల పాలవుతారు" అని యీనాడు కవులు చాటిస్తున్నారు. తమ గ్రంథాలకు తామే చుట్టూ కంచెలువేసి మంచె మీద ఎక్కి నలువైపులా నిక్కిచూస్తూ వడిసెల తిప్పి తమ గ్రంథాలలోని పాటలు పద్యాల కంకులను తమ అనుమతిలేకుండా అరగించుచున్న పిట్టలపొట్టలపై గొట్టుటకు కవులు పొలము కాపులవలె తయారైనారు.

'సత్కవుల్ హాలికులైన నేమి? - నిజదారసుతోదరపోషణార్థమై' అనేటటువంటి పోతన్నగారి వాక్యాన్ని ప్రమాణంగా ఉదహరించినప్పటికీ, "వడిగలయెద్దులగట్టుక మడిదున్నక బ్రతుకవచ్చు మహిలో సుమతీ" అనే వాక్యాన్ని అనుసరించిన సుమతులు కారు మన పండితులు — ఈనాటి కవులు నేడు తమ కావ్యాలకు కొన్ని వేలప్రతులను ఒక్క నిర్ణీత సంఖ్యగా అచ్చువేసికొని అమ్ముకొనడానికి గ్రంథముద్రాపకులకు గ్రంథప్రకాశకులకు గ్రంథవ్యాపారస్థులకు కవులు వ్రాసియిచ్చినట్లుగా కవులు తమ గ్రంథాలఫలసాయంలో కొంతభాగంయిచ్చి తమ గ్రంథములద్వారా 'నిజదారసుతోదర పోషణం' చేసికొనడంసంభవిస్తోందికాని తమ దృశ్యప్రబంధాలను (నాటకాలను) తమ శ్రావ్యప్రబంధాలను (గేయాలు, పద్యాలుగల గ్రంథాలను) ప్రజలకు ప్రసాదం పంచిపెట్టినట్లుగా పంచిపెట్టుతున్నారా? లేదు.

"విద్యయను దివ్యధనం బఖిలార్థకోటికిన్ పూర్తిగ నిచ్చినన్ పెరుగు; పోదు యుగాంతపువేళనైన-" అన్నాడు-విద్యఅనే దివ్యధనమును ప్రజలకు ఎంత పంచిపెట్టినప్పటికీ, అది ఇంకా పెరిగి వృద్ధిఅవుతుంది గాని, తరగదు. యుగాంతపువేళవరకు పంచిపెట్టినప్పటికీ తరగదు. అటువంటి సందర్భంలో అనేక శాస్త్రముల రహస్యములను దాచిపెట్టడం ఎందుచేత? ఆటంబాంబు ఏవిధంగా తయారుచేస్తారు? అణుశక్తిని ఉత్పత్తి చేసేటటువంటి యంత్రములను ఏవిధంగా తయారు చేస్తారు? ఈ విషయములను అమెరికావారు అతి రహస్యంగా దాచిఉంచుకొన్నారు. యితర దేశాలవారు తలక్రిందులుగా తపస్సుచేసి వారి శుశ్రూష చేసినప్పటికీ ఆ శాస్త్రరహస్యములను ఉపదేశించరు. తనకు తెలిసిన విద్యలను ఎవరికీ బోధించనటువంటివాడు బ్రహ్మరాక్షసియై పుట్టునని మన పూర్వగ్రంథాలలో పూర్వకథలలో ఉంది. కొన్ని కృత్రిమ పదార్థాలతో, చక్కని స్థిరమైన ఛాయగల రంగులను రసాయనిక సంయోగములవల్ల తయారుచేయడం జర్మనుశాస్త్రజ్ఞులు కనిపెట్టియుండిరి. మొదటిప్రపంచ మహాసంగ్రామ కాలంలో ఆ రంగులు జర్మనీనుంచి సప్లయి కాలేదు. ఆ రంగులను తయారుచేయడం యింకో దేశంవారికి అప్పుడు తెలియదు. జర్మనీవాళ్లకు రసాయనశాస్త్ర రహస్యాలు అనేకం తెలిసియుండెను. వారు యీ విద్యను ఎవరికీ బోధించక అతిరహస్యంగా ఉంచారు. అటువంటి విద్యాలోభులే లోకకంటకులై మహాసంగ్రామ జనసంహారకారకులై ప్రపంచానికి బ్రహ్మరాక్షసులవలె పరిణమించి రణరంగాలను రక్తప్రవాహాలు చేశారు. రెండో ప్రపంచ సంగ్రామకాలంలో హిట్లరుకూడా తొడలుకొట్టి మీసాలు దువ్వి "చూసుకో జర్మను తడాఖా! చూసుకో జర్మను మజాఖా! మాదగ్గిర రహస్యాస్త్రం ఒకటి ఉంది. దానిని మేము ప్రయోగించినట్లయితే ప్రపంచం తల్లడిల్లిపోతుంది. జనులు దోమలవలె మలమల మాడిపోతారు" అన్నాడు. ఆ రహస్యాస్త్రం ఏమిటయ్యా అంటే ఆటంబాంబు. ఆఖరుకు ఆ రహస్యాస్త్రమును ఆ పరమాణు అస్త్రమును ప్రయోగించకుండా పరలోకగతుడైనాడుహిట్లరు. నాజీప్రముఖులు రహస్యంగా కనిపెట్టిన ఆటంబాంబు నేడు అమెరికావారి అతి రహస్యాయుధంగా ఉంది. ఆఖరు కది చిదంబర రహస్యంగా అచిరకాలంలోనే అన్నిదేశాలవారికీ లభ్యమై, ఆటంబాంబు "ఆట బాంబు" కావచ్చు.

ఇంతకూ చెప్పవచ్చిం దేమిటంటే, శాస్త్రములను విద్యలను కొందరు రహస్యంగా దాచిపెట్టి తామే ఆ విద్యకు అధికారులమని గర్వించి యితరులకు తమ విద్యను పంచిపెట్టరు. ఆ విధంగా ప్రవర్తించేటటువంటి పండితులు విద్యలకు (అధికారులు) అధికఅరులు (శత్రువులు) అయిన కారణంచేత విద్యలకు అధికారులనే అన్వయించాలి. ఆవిధంగా విద్యలను రహస్యంగా ఉంచి, నాశనంచేసినవారు విద్వాంసులే. విద్యలు నాశనం కావడం ప్రభుత్వపోషణ లేక కాదు. ఈకాలంలో ప్రభుత్వరక్షణ ఎక్కువై, విద్యలున్నాశనం కాగలవు. లేదా పండితులు తమ విద్యలను ఎక్కువ మక్కువతో దాచియుంచి, కప్పిపెట్టి పాతిపెట్టమేడ కారణంకాగలదు. "ఆ వికృతపు జాడ్యమా దొరది" అనే మాట యీకాలపు కొన్ని దేశాల దొరతనముల విషయంలో చెప్పవచ్చు. ఈకాలంలో "అ వికృతపుజాడ్యమా కవిది" అని కూడా చెప్పవచ్చు.

భుక్తికొరకై విద్యలను వినియోగించడం వల్లను, విద్యలయొక్క పరమార్థము కేవలం అయిహిక ప్రయోజనములను అష్టయిశ్వర్యములను భాగ్యభోగ్యములను సాధించడమే అని వాదించడంవల్లను, మన సరస్వతీ ప్రార్థన అంతా లక్ష్మీకటాక్షంకోసమే అని చెప్పకతప్పదు.

కనుక విద్యఅనేది మనుష్యునకు అసలైన అలంకారమనిన్నీ, అటువంటి అలంకారం ఉన్నవాడు కిరీటాలు, భుజకీర్తులు చంద్రహారాలు మొదలైనవాటిని ఆసించకూడదనిన్నీ వాదించడంలో అర్థంలేదు. 'కనకాభిషేకాలు కావాలి. వరహాలహారాలు కావాలి. అగ్రహారాలుకావాలి. తూగుటుయ్యాలలుకావాలి.' అనే విద్వాంసుడు ఈవిద్యఅనే అలంకారం తనకు ఉన్నంత మాత్రాన తృప్తిపడుటలేదు. తృప్తిపడడు. "దినవచ్చు మేరాజు దీర్పగలడు" అనే ఆవేదనతో విద్యను "నిజదారసుతోదర పోషణార్థమైన" ఉపాధిగా ఊహించి ఉద్దేశించి విద్యకు విలువకట్టినప్పుడు, ఏ వృత్తి లాభసాటిగా ఉంటే, ఆ వృత్తివిద్యనే జనం అభ్యసిస్తారు.

ప్లీడరీవృత్తిలో చేరినవారి సంఖ్య ఎక్కువగా పెరిగిపోయిందనిన్నీ, ప్లీడరీలో గిట్టుబాటు లేదనిన్నీ, ప్లీడరీ అంటే లాటరీగా ఉంటున్నదనిన్నీ, పటాటోపానికి తగిన ప్రాక్టీసు చాలామందికి ఉండడంలేదనిన్నీ, ఖాజ్ఞావాని జీతం మీసాలకు.వరంఖర్చుకే సరిపోవుచున్నదన్నట్లుగా, 'తలచుకో తలచుకున్నంత అప్పుపుచ్చుకో' అన్నట్లుగా నెలకొకసారి తల తడవి చూచుకోవలసి ఉంటున్నదనిన్నీ, ఒక వదంతి వ్యాపించింది. అంతకంటే గిట్టుబాటైన మరొక వృత్తి కోసం విద్యార్థులు కలువరిస్తారు

ప్లీడర్ల కొడుకులు ఇంజనీర్లు కావాలని ప్రయత్నిస్తారు. ఇంజనీర్లు చాలామంది యిటీవల "రంజనచెడి పాండవు లరిభంజనులై" రన్నట్లుగా ప్రభుత్వాశ్రయం లేకుండా నిలువ నీడలేకుండా తొలగింపబడినారనే వార్త విస్తరించినసందర్భంలో ఇంజనీర్ల బిడ్డలు యింకో వృత్తికి తర్ఫీయతు కావాలి. ఈ విధంగా వృత్తులకు స్థిరచిత్తం లేదు. "ఏతావునరా నిలుకడనీకు, ఎంచి చూడగ" అని త్యాగరాజులవారు ప్రశ్నించినట్లుగా, ఈ స్థిరచిత్తంలేని జీవిత ప్రవృత్తి

వల్ల, వంశపారంపార్యాసంక్రమించే విద్యాప్రావీణ్యం కూడా నశిస్తుంది. కుమ్మరివానికొడుకు తిరిగి కుమ్మరి అయితే, వంశపారంపర్యమైన ప్రావీణ్యం ప్రవరమాన మవుతుంది. కాని, కుమ్మరివాని కొడుకు కమ్మరి అయితే, ఈ కమ్మరివాని బిడ్డకు చాకలి అయితే, ఆ చాకలిపుత్రుడు మంగలి అయితే, యీ మంగలివాని సంతానం సాలెవాడైతే, ఈ సాలెవాని సుతుడు - అగసాలెవాడు (స్వర్ణకారుడు) అయితే, కావచ్చు - వివృత్తి లాభసాటిగా

(52–వ పేజీ చూడండి)



ప్రణయలీలః

—చిత్రకారుడు: శ్రీ గోలి శేషయ్య (తెనాలి)

# బికారి

## 1

అస్తమయ భాస్కరుడు తన అరుణకిరణ బాణాలతో విశాల వినీలాకాశము నే పచ్చికబయలులో తిరగాడుతున్న మబ్బు లేళ్ళను వేటాడుతున్నాడు. ప్రకృతంతా బంగారు నీటి కొలనులో మునిగి లేచినట్లు మిసమిసలాడుతోంది.

ఆ పుంతలో దాదాపు పాతికమంది పిల్లలు - అక్కడ 'ఛూ తు మ్మం డ'— యిక్కడ 'చెడు గుడు' - ఆ ప్రక్కన 'దాగుడుమూతలు'— ఈ ప్రక్కన మరొకటి ఎవరి అర్హతలనుబట్టి వారు కేరింతాలాడుతూ ఆడుకొంటున్నారు. వారి చౌకళింపులకు చెలరేగిన ధూళులు భాషకందని ఏదో నవావేశంతో దిక్కులకు పయనిస్తున్నాయి. ఆడుకొనే అమాయకుల లేత దేహాలను నిమిరి అలపు మాన్పుతోంది చల్లగా మెల్లగా వీచే గాలి.

ఒక్కసారిగా పిల్లలందరూ ఎక్కడి వారక్కడే తక్కున ఆగిపోయ్యారు. పాతిక జతల నీలికళ్ళూ ఒకే లక్ష్యానికి కేంద్రీకరించబడినయ్. దీపావళినాడు చిరుగాలిగి రెపరెపలాడే దీపావళిలా ఆ లేతకళ్ళన్నీ కళకళపడ్డయ్.

క్షామ పిశాచి రక్తమాంసాలను పీల్చి పిప్పి చేసి మిగిలినదానిని మృత్యు రక్కసి కోసం విసిరిన ఎముకలసుప్ప ఆ పిల్లలు ఆట ఆటంకానికి కారణం. వారి భయాశ్చర్యాలకు హేతువు. క్రిందటి జన్మలో కూడా సంస్కారం లేక పూర్తిగా మట్టి కొట్టుకుపోయి పిల్లు కటి పొదలాగు గుబురుగా పెరిగిన జుట్టూ - దాదాపు మొఖాన్నంతనూ ఆవరించుకొనేలా పెరిగిన పెద్ద బవిరి గడ్డమూ - గడ్డకట్టి బీటలు వారిన దైన్యంలాంటి ముడుతలు పడిపోయిన నొసలూ—అతిలోతుగా పోయి జీవకళను కోల్పోయిన కళ్ళూ - ఎండిపోయిన ఎముకలు పైకి పొడుచుకొని వచ్చిన - సహజంగా విశాలమైన బోరా - ఏనాటినుండో నిండైన ఆహార మెరుగక గుంటపడిపోయి వెన్నెముక కంటుకుపోయిన జీర్ణోదరమూ — చీకి చిరిగిపోతున్న ! చాలీచాలని మసిగుడ్డలాంటి గోచీ - తుప్పుపట్టిన సన్నని ఇనుప ఊచల్లాంటి కాలుచేతులూ గల ఒక బికారి పడుతూ, లేస్తూ- తూలుతూ జోగుతూ పిల్లలవైపు వస్తున్నాడు.

బికారి పిల్లల మధ్యనుండి పోతూ- వారినొకసారి బెదురుగా ఒకసారి శూన్యంగా ఒకసారి ఆప్యాయంగా చూస్తూ కొంచెం ముందుకు సాగాడు. ఆ అభాగ్యుని లోకువ కనిపెట్టిన పిల్లలు ఆటలుకట్టిపెట్టి రణగొలతో వెంటబడ్డారు.

## "ప్రభంజనం"

తూలుతూ ముందు బికారి — గెంతుతూ వెనుక పిల్లలూ నడుస్తున్నారు. కృష్ణ తమ్ముడి చెయ్యి పట్టుకుని రాము బావ ప్రక్కనే బెదురుతూ నడుస్తున్నది అలివేలు. ఎంత అల్లరి చేసినా బిత్తరిచూపులు చూడటం తప్ప ఏమీ చేయని బికారిలోకువ పిల్లల్ని మరింత సాహసకార్యానికి పురికొల్పింది. రాము తన చుట్టూ వెదికి నాలు వైపులా వాడిగా మొనలు తేరిన రాయి తీసి కృష్ణకు చూపి బికారివేపు చెయ్యి ఝూపిస్తూ కన్నుకొట్టాడు.

"ఉండుండు! నేను కూడా ఓమంచి రాయి తీసుకోనియ్యి" కృష్ణ అక్కడున్న వాటిలోకల్లా ఊతంగా పల్చగా ఉన్న రాయితీసి "దెబ్బకి చూచావా ఎలాగుందో" అంటూ చూపుడు వేలితో రాయి మొనను రాస్తూ రాముకు చూపించాడు. దీనితో అక్కడిపిల్లలందరూ తలా ఒక రాయితీసుకొని ఒకేసారి బికారిమీద రాళ్లవర్షం కురిపించారు. రాము విసిరిన రాయి బికారి కుడి జెబ్బమీద దాదాపు దబ్బంత గాయం చేసింది. వాసుగాడు విసిరిన రాయి ఎడమ దవడనుకత్తిలా చీరుకూ దూసుకుపోయింది. బాధితుడు రెండు గాయాల్ని చెరి ఒక చేతితోనూ తడుముకున్నాడు. జెబ్బమీద దెబ్బ చేతికి సరిగా అందలేదు. చిమ్మించిన రక్తం మెల్లగా గాయాల్లోకి చిందింది. బికారి బాధతో వణికాడు. వెనక్కి తిరిగి పిల్లలను భయంగా - దైన్యంగా చూచాడు. అతని అసహాయహృదయం కుమిలి కుమిలి ఏడ్చింది. యావత్ మానవసమాజంలో నూ పిల్లలమీద మాత్రమే మిగిలిన అతనికొద్ది విశ్వాసమూ సడలిపోతుంటే కళ్లు చెమరించాయి. గాయాలనుండి రక్తం కారసాగింది.

బికారి స్థితిని చూచిన అలివేలు కెందుకో ఏడుపుపర్యంతమైంది. బావా, తమ్ముడూ చేసినపని అన్యాయమని గ్రహించిన ఆమె హృదయం ఆవేశపడింది. కాని ఆమె ఏం చేయగలదు గనుక ! ఏమన్నా అంటే రాము బావ కొట్టనైనా కొడతాడు. లేక పోతే మర్నాడు ఆటకే రానివ్వడు ! ఇక తమ్ముడికి తనంటే అసలే లెక్కలేదు !

## 2

ఊరిమధ్య ప్రవేశించారు ముందు బికారి వెనుకపిల్లలూ. నడుస్తూనే బికారి నలువైపులా వేయికళ్ళతో చూస్తున్నాడు. ఒక పెద్దపెంకుటింటి సమీపానికొచ్చారు. ఆ యింటి దొడ్డిగోడమీదనుంచి వీధి కాలువల్లో 'తప్' మని ఒక విస్తరిపడింది. బికారి తక్కున ఆగాడు. విస్తరివంక చూచాడు. గొట్టం ఒకచివరినుండిచూస్తే రెండోచివర వెలిగే దీపకళికల్లా అతని కళ్లు లోతుల్లోంచి మెరిశాయి. ఒక విసురుతో విస్తరిమీద పడ్డాడు. వెంటనే అతనిమీద కడుపులంటుకుపోయిన రెండు కుక్కలు పడ్డాయి. వాటిలో నల్లకుక్క విస్తరిపట్టుకున్న బికారికుడిచేతి మణికట్టు మీద లోతుగా కరిచి కసిదీరా పీకిపారేసింది. కరుస్తుంది! ఎందుకు కరవదు ? 'తమకు' లేకపోతే అనుభవించాలిగాని 'తమకు' ప్రాణాధారమైన వీటిమీదకూడా మానవులు దాడిచేస్తుంటే కుక్కలుమాత్రం కరవక ముద్దు పెట్టుకొంటాయా? బికారి విస్తరి వదలి వెనక్కి జోగిపోయాడు. గాయపు రక్తాన్ని పెదాలకు పులుముకుంటూ తన ముందున్న ప్రపంచాన్నంతా ఏ మహాకవీ- ఏ మనస్తత్వవేత్తా భాష్యం వ్రాయలేని దృష్టులతో చూచాడు తనచుట్టూ తాను చూచుకున్నాడు. కళ్లు మళ్ళీ ఆశతో మెరిశాయి. రెండుగజాలదూరంలో సగం కుళ్ళి సగంవడిలిపోయిన ఒక పచ్చివంకాయను బికారి మరుక్షణంలో నములుతున్నాడు. పచ్చివంకాయ కాదు నల్లరాళ్లు [illegible] కరుగు

# ★ బికారి ★

తాయి అతని కడుపులో ఎగిసిన జ్వాలలను. ఎదురుగా రోడ్డుమీద నిలుచున్న పిల్లు మూకంతా విడ్డూరంగా చూస్తున్నారు.

"వంకాయ్ ఎలా పరపర నమిలేస్తున్నాడో" అన్నాడు బాబిగాడు ఆశ్చర్యపోతూ.

"ఒకరాచ్చసుడు మడుసులు మడుసుల్నే నమిలేసేవాడట. ఓనాడు మా తాతయ్య కథలో చెప్పాడు" అన్నాడు నానిగాడు.

"ఒకేల ఈడూ రాచ్చసుడేమోరా బాబు" రెండడుగులు వెనక్కు వేసి భయంగా చూశాడు బికారివంక చంటిబాబు.

"ఏమో బాబు యిక్కడుండకూడదు పోదాంరారా బాబీ" గోపీ తమ్ముణ్ణి పిలిచాడు.

"మూడరాపాపం ఎలా తింటున్నాడో. ఆకలేస్తుందేమోరా" జాలి ప్రకటించాడు బాబిగాడు. సర్వమానవ సామాన్యమైన హృద్భాషలో బికారిముఖంమీద రాసి ఉన్న 'ఆకలి'ని అక్షరం అక్షరం కూడబలుక్కుని యిప్పటికి చదవగల్గాడు బాబిగాడు.

"ఒరే రామన్నయ్యా కుడుములు తింటాడేమో పెడదామా' అన్నాడు వాసు.

"ఊఁ. చేగిపట్టుకురా పెడదాం. గమ్మున రావాలి మరి" పురికొల్పాడు రాము.

బికారి కళ్ళింతలు చేసుకొని రెప్పపాటు లేకుండా చూస్తున్నాడు పిల్లలవంక. అలా చూస్తున్న బికారిని మాస్తుంటే అలివేలుకు 'ఇందుకు' అనరాని దుఃఖం పొంగి కళ్ళ ద్వారా పొర్లింది. అదరిపాటుగా నిలుచున్న అలివేలు జడ రాము హఠాత్తుగా లాగాడు. అలివేలు వెల్లకిలా పడిపోయింది. రాము కంగారుపడుతూ అలివేలును లేవదీసి కళ్ళనీళ్లు చూచి గాభరాపడ్డాడు. కాని వెంటనే కాస్త ధీమా తెచ్చుకుని "ఓస్ ఈ మాత్రందానికే ఏడుస్తున్నావా" అన్నాడు. ఆకళ్ళనీళ్లు తను లాగినందుకే ననుకున్నాడు వాడు. ఏదో కాస్త ఊరడించవలసిన బాధ్యత తనమీద ఉంది కాబట్టి "పోయి మళ్ళీ మన ఆట మొదలెడదాం వస్తావా" అడిగాడు. అది రానన్నట్టు తల అడ్డంగా తిప్పింది.

ఇంతలో వాసు రెండు పెద్దకుడుములూ యింత తాటిరొట్టే పట్టుకొని వగర్చుకొంటూ వచ్చాడు. తనంతతాను వాటిని బికారికివ్వడానికి వాడికి భయమేసింది. బాబిచేతికిచ్చాడు. బాబిగాడు వెళ్ళియిద్దామని బికారి నొకసారి తేరిపార చూచాడు. తీరా దగ్గరికెళ్ళాక పట్టుకొని నమిలి మింగుతాడేమో వని వాడికి భయమేసింది. అక్కడున్న ప్రతి ఒక్కరూ వెనుదీశారు అవి బికారికందివ్వడానికి. తాము మహాధైర్యవంతులమనీ, బలవంతులమనీ ఋజువుచేసుకోడానికి రోజూ ఒక అరడజనుమందిని - తమకంటె చిన్నవారిని-ఆటలో చావగొట్టి చెవులు మూసి యింటికి పంపించి రొమ్ములు విరుచుకు తిరిగే రామూ, పెదకాపూ, కృష్ణాగూడా వీపులు చూపారు.

"పోనీ దగ్గరికి గిరవెయ్యరా బాబీ" సలహా చెప్పాడు నానిగాడు. గిరవెయ్యడానికని ఎత్తిన బాబిగాడి కుడిచెయ్యి వెంటనే పట్టుకుంది అలివేలు. బాబిగాడు ప్రశ్నార్థకంగా చూచాడు అలివేలు వంక.

"గిరవెయ్యకు, ఇటుతే నేను పట్టుకెళ్ళి యిస్తాను" వీరులనుకొన్నవారంతా ఆశ్చర్యంతో చూచారు అలివేలును. ఇంతవరకూ తదేక ధ్యానంతో రొట్టె - కుడుములవంకా చూస్తున్న బికారి కళ్లు అలివేలుమీదికి సంభ్రమంగా తిరిగాయి. బాబిగాడు సందేహిస్తున్నాడు వాటిని అలివేలుకివ్వడానికి.

"ఇటుతే, నే నిస్తానన్నాగా విసిరితే మట్టికొట్టుకు పోతాయ్" మళ్ళీ పృచ్ఛించింది అలివేలు.

"ఒరే! బాబీ యివ్వరా ఏమాత్రం యిస్తుందో అదీ చూద్దాం. దగ్గిరకెడితే వాడు దీన్ని నమిలి మింగుతాడు. రాచ్చసుడురా బాబూ వాడు" నానిగాడు భయపెట్టాడు. తమ మగ పిల్లలెవరూ చేయలేనిది ఆడపిల్ల అలివేలు చేయడానికి సాహసించిందంటే మగవారి తరఫున వాడికి తలకొట్టేసినట్లయింది.

బాబిగాడు యిచ్చాడు. అలివేలు అవి పట్టుకొని మెల్లగా - నిర్భయంగా కాలువవాలు దిగింది. కృతజ్ఞత తో విద్యుత్ శలాకలలాగు మెరిసిపోతున్న కళ్ళతో బికారి అలివేలును కలయచూస్తూ దోసిలి పట్టాడు. అలివేలు దోసిట్లో వేసింది. బికారి కళ్ళు హర్షజలంతో చెమ్మగిల్లాయి. అతని హృదయం ఆ పిల్లలమీద కృతజ్ఞతతో నిండింది. వారిని వేయి విధాలు మూగగా దీవించాడా అభాగ్యుడు. పది నిముషాల క్రితమే పిల్లలమీదకూడా పోయివ విశ్వాసం తిరిగి శతాధికమై అతనిలో ప్రవేశించింది. దానితో అతని దీనవదనం వేయి దివ్వెల కాంతితో ప్రకాశించింది. అతనికా కుడుములూ - రొట్టె గడ్డకట్టిన అమృతం, అంత ఊరిమిన మేఘం ఆ మాత్రం కురియదా!

"నాకూ భయంలేదు. నేనూ ఇవ్వగల్ను. మరి నన్ను ఎవరూ యిమ్మనలేదుగా"

మిత్రుడు: అదేమిటోయ్; భాయ్! అలా దిగులుగా వున్నావేం?

చిత్రకారుడు: ఇంత కష్టపడి వేసిన బొమ్మ పాడైపోయిందోయ్.

మిత్రుడు: ఏం? ఏం పాడైందీ?

చిత్రకారుడు : ముక్కు.

మిత్రుడు: పోనీ దిద్దెయ్యలేక పోయావా?

చిత్రకారుడు: అదే చూస్తున్నాను. కానీ - అసలు యిందులో ముక్కు ఎక్కడ వేశానో తెలియటం లేదు!

అన్నాడు రాము బోర్ల పడిపోయిన మగతనాన్ని నిలబెట్ట ప్రయత్నిస్తూ.

"నేనూ అంతే. నాకూ భయంలేదు వాడంటే" కృష్ణ అందుకున్నాడు.

"నేను మాత్రం?" అన్నాడు పెదకాపు బోర విరుస్తూ.

## 3

కబంధహస్తాలలో చీకటిరేఖలు సంధ్యను కౌగలించుకున్నాయ్. క్రమక్రమంగా కాలాంజనం ఎగబోసినట్టు - హాలాహలం కళ్ళాపుజల్లినట్టు చీకటి నలువైపులా వ్యాపించింది. ఆకాశంమీది కొద్ది నక్షత్రాలు చిక్కటి చీకటిని చీల్చుకుంటూ ప్రకాశింప ప్రయాసపడుతున్నయ్.

పుంతలో బికారి వెనుకనుంచి వచ్చిపడుతున్న రాళ్ళ వర్షాన్నుండి తప్పించుకోడానికి కంగారుగా నడవబోయి పాదం మడత పడి బోర్లపడ్డాడు. అక్కడే ఉన్న ఒక తాటి గరిగమ్మ అతని నొసల్ని క్రూరంగా కోసింది. నోటినిండా యిసుక కూరుకుపోయింది. తొందరగా లేవాలనే విశ్వప్రయత్నంతో నిర్జీవమైన అతని అవయవాలు మెలికలు తిరిగి పోతున్నాయ్.

"ఇక పోతాడులే దొంగవెధవ" కొద్దిదూరాన్నుండి వినిపించిందో మానవకంఠం. బికారిని ఊర్లోంచి తరిమివేయడానికివచ్చిన యిద్దరు యువకయోధులు వెనుతిరిగి పోయారు.

## రచయితలకు మనవి

**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాగితానికి ఒకే వైపున సిరాతో వ్రాసి పంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన వానిని త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

రచయితలూ, చిత్రకారులూ సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

సుమారు పదిగంటలవుతోంది. కీచురాళ్ళ రొదతో ప్రకృతి తల్లక్రిందులై పోతోంది. గాలివేగం కొద్ది కొద్దిగా హెచ్చ నారంభించింది. గాలి విసురుకు చెట్లు తలలు వంచి తిరిగి ఎత్తేటప్పుడు కలిగే "బంయ్" మనే భయంకర సంగీతం ప్రకృతి ఎందుకో విడిచే బలమైన నిట్టూర్పులా ఉంది.

కలశక్తినంతనూ కేంద్రీకరించుకొని మెల్లగా లేచాడు బికారి. నోటినిండా కూరుకుపోయిన యిసుకను తొలగించుకోడానికి రెండుమూడు సార్లు "థూ థూ" మని ఉమిశాడు. కాని ఆ రెండుమూడుసార్లూ శక్తిలేని అతని పెదాలు ఉమిసిన దానిని అతని శరీరం దాటిపోనివ్వలేదు. ఒంటికంటుకున్న మట్టిని దులుపుకోనే ప్రయత్నంలో ఉమ్మినీ మట్టినీ కలిపి వళ్ళంతా పులుముకున్నాడు. మెల్లగా ముందుకు సాగాడు. నడుస్తున్నాడు; తూగిపోతూ. దాహంతో పెగాలు ఆరిపోయ్యాయ్. కుడిప్రక్కకు తిరిగాడు. బీభత్సంగా ఊగిపోతున్న పెద్ద చింతచెట్టు పెనుభూతంలా కనిపించింది. దానిక్రిందికి చేరాడు. తన కాళ్ళక్రింద స్థలం-ఎందరో మానవులు లౌకికవిచారాలన్నీ మరిచి శాశ్వతంగా విశ్రాంతి తీసుకుంటున్న స్థలమని అతనికేం తెలుసు? అతనికేదో ధ్వని వినిపించింది. ప్రక్కనే జలజలపారుతూ సాగుతున్న 'దొంగయేరు' సవ్వడి అది. దాహం తీర్చుకొందామనే ఆశతో రేవుకోసం వెతికాడు. కనపడలేదు. కాలికి తగిలిన చింతవేఱు ఆధారంగా కొద్దిగా యేటిలోకి దిగజారాడు. ఒకచేతితో వేఱుపట్టుకొని రెండవచేతితో నీరుతీసుకొని దాహం తీర్చుకున్నాడు. మెల్లగా ఎగప్రాకి చింతక్రిందికి వచ్చాడు. కాళ్ళు మరి కదలనివ్వలేదు. అప్రయత్నంగా కుదబడి చెట్టుమ్రానుకు చేరబడి కన్నుమూశాడు. నిద్రాదేవి అలసిపోయిన అతని శరీరాన్ని తన అమృతహస్తంతో నిమిరింది.

బికారి ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. రెండు నక్కలువచ్చి అతనిచుట్టూ తిరిగి నిరాశతో తొలగిపోయినయ్. అతని ఉనికినే గమనించని ఒక త్రాచు అతని కాలుమీదుగా జర్రున ముందుకు సాగిపోయింది. అయినా బికారి ప్రశాంతంగానే నిద్రపోతున్నాడు.

రాత్రి పన్నెండు గంటలయింది. ఆకసంమీద అక్కడక్కడా చెదరి మసిగుడ్డల్లా ఎగురుతున్న మబ్బుతునకలన్నీ పరస్పరం ఆకర్షించుకొని ఒకదానితో ఒకటి ఐక్యమై తిరిగి విచ్చలుకుని విస్తృతమైనల్లగొడుగులా ఆకాశమంతా కప్పాయి. గాలి చల్లగా వీచింది. కొద్దిసేపటికి చిన్నచిన్న తుప్పర్లు ప్రారంభమైనాయి. తుప్పర్లు చినుకులుగా మారాయి. గాలివేగం రానురాను హెచ్చింది. మానవనేత్రాలు భరించలేనంత కాంతులతో మెరుపులూ-సురభిరంగుల్లా ఉరుములూ ప్రారంభమైనాయి. ఒకొక్కక్క మెరుపుతో ప్రపంచమంతా 'జిగేల్' మని నలిగిపోతోంది. ఒకొక్కక్క ఉరుముతో భూగోళం బ్రద్దలైపోతుందా - ప్రాణికోటి గుండెలుపగిలిపోతాయా అనిపిస్తోంది. మెరుపులు-ఉరుములు వాన-గాలి. గాలి, వాన. యుగయుగాలుగా మానవకీటకాలు తనమీద సాధించిన అధికారమెంతవరకో చేసి నిరూపించదలుచుకొన్నదల్లే విజృంభించింది ప్రకృతి. పెచ్చురేగిన ప్రకృతిని ఆపగల సమర్థులెవరూ? మానవులా?! ప్రకృతి నానాటికి అర్థమౌతుందని కృతజ్ఞత చూపక నానాటికి ప్రకృతి మీద విజయం సాధించి కైవసం చేసుకుంటున్నామని విర్రవీగుతారు. భూలోకాన్ని కొన్ని కొన్ని క్షణాల్లోనే ముంచి పారెయ్యాలనే పట్టి ఆవేశంతో వర్షిస్తోంది ఆకాశం.. గాలివేగం అంచనా వెయ్యలేం. చెట్లు నూకటివేళ్ళతో భళ్ళున కూలిపోతున్నాయి. కొమ్మలు ఫెళ్ళున విరిగిపోతున్నాయి.

తళుక్ మని మెరిసింది. భయంకరంగా ఊగిపోతున్న చింతక్రింద బికారి గొంతుకూర్చున్నాడు. పగబట్టి కృశించిపోయిన నల్లత్రాచుల్లాంటి చేతులు కాళ్ళకుగట్టిగా చుట్టాడు. మోకాలి ముకుకులతో దవడలు నొక్కుకుంటూ గజగజ వణికిపోతున్నాడు ఎముకల్ని సైతం రంపం పట్టుతున్న చలితో.

అతని ప్రక్కనే 'దొంగయేరు' పొంగుతూ - గొప్పఉరవడితో - మృత్యుగుహల్లాంటి సుడిగుండాలతో ప్రవహిస్తున్నది గట్లను కోసుకొని పరిగెత్తే - యేటి ఉధృతానికి ఒక పెద్ద చెట్టు విరిగి యేటిలో పడింది. ఆ చెట్టు ప్రక్కనే ఉన్న ఒక ఈతచెట్టు యేటిలోనికి నెమ్మదిగా వంగింది.

## 4

తెల్లవారుఝామున మూడైంది. చిన్న చిన్న తుప్పర్లు తప్పితే వర్షం తగ్గిపోయింది. గాలికూడా చాలావరకూ శాంతించింది. కాని అప్పుడప్పుడూ మెరుపులూ, ఉరుములూ గతించిన ప్రళయానికి చిహ్నాలుగా మిగిలాయి. మబ్బులింకా విడిపోలేదు. ఆకసం అంతలోనూ ఎంతవెదకినా ఒక్క నక్షత్రం కూడా కనుపించటం లేదు. బహుశః నక్షత్రాలన్నీ గాలివేగానికి రేగుపళ్ళల్లా రాలిపోయుంటాయి.

చెట్టుక్రింద బికారి వణికిపోతున్నాడు. అప్పుడప్పుడూ ఒత్తుజుత్తునుంచి ముఖంమీదికి కారే నీటిని తుడుచుకుంటున్నాడు. ముడుచుకుపోయిన అవయవాల్ని ఒక్కసారి సాగదీసుకొని స్వాధీనంలోకి తెచ్చు

# ★ బికారి ★

కుందామని లేచి నిలుచున్నాడు. హఠాత్తుగా రెండు టార్చిలైట్ల నిశితకాంతులు అతనిమీదికి గురిచేయబడ్డాయి.

"కదిలావంటే చచ్చిపోతావు" గర్జన వినిపించింది దూరంనుంచి మరుక్షణంలో. కాంతివల్లే నైపురు చీకట్లుకమ్మిన కళ్లతో బికారి బిత్తరిచూపులు చూచాడు. బెదరి కొంచెం వెనక్కు తగ్గాడు. మరికొన్ని సెకన్లలో యమదండాల్లాంటి బడితెలతో ముగ్గురు యువకులు ప్రత్యక్షమయ్యారు. బికారి భయంగా చూచాడు వారి వంక. ఇంతవరకూ ప్రకృతి చేసిన మహా సంక్షోభానికి అతడు ఈషణ్మాత్రమూ చలించలేదు గాని వారిని చూడగానే నిలువునా కూలబడి పోయాడు. మానవులు సామాన్యమా మరి!

"ఎక్కడ దాచావో చెప్పు. లేకపోతే..." గదిస్తూ కట్టి చూపాడు ఒకడు. ఒక టార్చిలైటు కాంతి బికారి ముఖంమీద ప్రకాశిస్తూనే ఉంది. భయోత్పాతమైనా అతనికోసం ప్రకాశించేకాంతి అతని జీవితంలో అదొక్కటే.

బిత్తరిచూపులు చూడటం తప్ప బికారి కిక్కురు మనలేదు.

"చెప్పవేంరా! దొంగగాడ్డీ" కర్రతో బికారి బోరమీద పొడిచాడు. నింతనూను మీదికి విరగబడ్డాడు బికారి.

"చెప్పు తొరగా కంచం ఎక్కడ దాచావ్" అదిలించాడు టార్చి గురిపెడుతున్న మనిషి!

బికారి లేచి నిలబడటానికి ప్రయాసపడుతున్నాడు.

"నించో సరిగా"

"..............."

"చెప్పు వెండికంచం ఎక్కడ దాచావో"

"..............."

"చెప్పరా వెధవా" చించుకుంటున్నారు. బికారి అవుననడు. కాదనడు. ఊరికే చూస్తాడు శూన్యంగా. ఇంతవరకూ కొంతదూరాన్ని నిల్చున్న మూడోమనిషి కొంచెం దగ్గరికి వచ్చి బికారిని పరీక్షించి అన్నాడు.

"ఒరే గంగన్నా! వీడు, రాత్రి నేనూ సుబ్బారావూ ఊర్లోంచి తరిమేసిన దొంగవెధవేలాగున్నాడురా."

"అయితే మొత్తానికి ఊరొదిలిపోలేదన్న మాట"

"ఎలావస్తాడు వచ్చినపని కాందే"

"ఇంక మనం చెయాల్సిన పని చేస్తేనే గాని వీడు చెప్పడు" అంటూ బడితె త్రిప్పి వేశాడో బలవంతుడు బికారి ఏగాలుమీద. ఫళ్లుమని వినిపించింది ఎక్కడనుంచో నూతిలో ధ్వనిలాగ. "అమ్మా" అరిచాడు. బికారి కుప్పగా కూలిపోయాడు. చివికి జీర్ణించిపోతున్న మానవత్వానికి సవాల్ లా ఉంది ఆ ధ్వని.

"లేచి నిలబడు"

"నిలబడవేరా"

చచ్చినపాముని పొరవేయడానికి జాని నడుముక్రింద కట్టిదూర్చి ఎత్తినట్టు, నేలకంటుకు పోయిన బికారి నడుముక్రింద బడితె పెట్టి కొద్దిగా లేవదిసి విసిరాడు ఏ గాలు విరగొట్టిన బలశాలి. ఏటిఅంచునే పడ్డాడు బికారి.

"నాటకం ఆడుతున్నాడు."

విసిరిన ఆసామీ బికారిదగ్గరకు నడుస్తున్నాడు. ఏటి ఉరవడికి బికారిక్రింద గట్టు

కెల్లు విరిగి బల్లనపడింది ఏటిలో...కంగారుగా టార్చి వేశారు ఏటిలోకి. ఒక పెద్దసుడిగుండం ఆ అభాగ్యుణ్ణి అప్యాయంగా కౌగలించుకుంటోంది. వెలవెలపోతూ చూస్తున్నారు ముగ్గురూ. సుడిగుండం తల్లిలా అతన్ని తనలో దాచుకొంది.

"అరె! యిలాపడిపోతాడనుకోలేదే"

"ఇంతకూ కంచం ఎక్కడదాచాడో చెప్పకుండా చచ్చాడు"

"పాపం! అలా చచ్చిపోతా డనుకో లేదురా"

ముగ్గురూ వెతికారు చుట్టుపట్ల వెండి కంచంకోసం. కాని లాభం లేకపోయింది. వచ్చినదారినే నడుస్తున్నారు ముగ్గురూ సాలోచనగా.

"ఆట్టే గింజుకోకు పళ్ళుపొడిచెయ్యగలను తెలుసా" ముందునుంచి వినవచ్చింది. ఆరుగురు యిద్దరు బలిష్టుల్ని రెక్కలు విరిచి కట్టి తీసుకొస్తున్నారు.

"దొంగలు దొరికారురా రాజియ్యా."

"దొంగలా!" ఇంచుమించు ఒకేసారి అన్నారు ముగ్గురూ.

"ఇదిగో కంచం. అలా చూస్తారేంరా, మమ్మల్ని చూచి దొరయ్య బాబయ్యగారి దొరువుదగ్గర గచ్చపొదలో నక్కారు పాపం."

రాజియ్య కంచం పుచ్చుకున్నాడు. రంగన్న టార్చి వేశాడు కంచం మీదికి. ఆ వెండికంచంలో - టార్చి కాంతిలో రాజియ్యకు కనపడింది అతని ప్రతిబింబం కాదు. "అమ్మ" అని ఒరిగిపోతున్న బికారి ప్రతిబింబం.

"బికారీ!" రాజియ్య పిచ్చివాడులా పెద్దగా అరిచి కంచంవదిలేసి కాళ్లు నరికిన వాడిలా కూలబడ్డాడు.

"అదేంరా రాజియ్యా!!"

"చెబుతాంలే నడండి" తలిమ్మా యిద్దరూ బుర్రలు దించి రాజియ్యను చూశారు. మెరిసింది. ఉరిమింది.

## దుబారాకి అంతు ఏమిటి!

★

కవిగా దేశంలో చాలా పేరు సంపాదించిన ఒకవ్యక్తిని ఒకానొక ఫిలిం స్టూడియో అధికారులు నెలకు మూడు వేల జీతం మీద తమ సంస్థలో కథకుడుగా తీసుకొన్నారు. అతను వెంటనే వచ్చి చేరాడు. కానీ చెయ్యటానికి ఏమీ పని కన్పించేది కాదు. ఒకరోజు స్టూడియో యజమానితో చెప్పాడు-పని ఏదీ లేకుండా కూర్చోటం తనకు చాలా కష్టంగా వుందని. యజమాని అర నిమిషం ఆలోచించి - "మన స్టూడియో చూడటానికి ప్రతిరోజూ ఎందరో ఆడవాళ్లు వస్తుంటారు. మీరు, మరోలా అనుకోకపోతే, ప్రతిరోజూ వాళ్లని వెంట పెట్టుకొని స్టూడియో అంతా చూపించేట్లయితే, ఆడవాళ్ల మనస్తత్వాలు తెలుసుకొనేందుకు మీకు అదొక మంచి అవకాశం అవుతుంది. అలా చేయండి." అన్నాడు.

గతిలేని కవి అందుకు ఒప్పుకొన్నాడు. ఆమరునాడే కాలేజీ గరల్సు జట్టు ఒకటి స్టూడియో చూడటానికి వచ్చింది. ఇతడు వాళ్లని వెంటబెట్టుకొని వెళ్లి స్టూడియో అంతా చూపిస్తున్నాడు. అక్కడ ఒకమూల బ్రహ్మాండమైన భవనం వుంటే, 'అదేమిటి'ని వారిలో ఒక అమ్మాయి యితన్ని అడిగింది.

"అదా? అదీ...పనికిరాని కొయ్యాగుట్రా పడేసే కొట్టు" అన్నాడు ఆకవి.

"చూశావటే సరోజా! పనికిరాని సామాను పడెయ్యటం కోసం ఎంతపెద్ద భవనం కట్టారో? ఈసినిమా వాళ్లు యీావరసని ఎంతెంత డబ్బు వృథా చేస్తారో గదా?" అన్నది అందులో ఒకపిల్ల.

"ఆకథ అంతటితో అయిపోలేదమ్మా! ఆభవనం ఏమిటో, అది ఎందుకు వుపయోగపడుతుందో మీలాంటి వారందరికీ చెప్పటానికి నాకు నెలకు మూడువేలు యిచ్చి నన్నిక్కడ పడేసి పెట్టారు" అన్నాడు కవి.

# ప్రారంభోత్సవం

హనుమంతరావు మాటిమాటికీ ముక్కు మీద వ్రాలటానికి ప్రయత్నిస్తూన్న ఈగను తోలుకుంటూ, కుర్చీలో ఒక ప్రక్కకు ఒరిగాడు. మధ్యాహ్నం కాబట్టి చాలా వేడిగావుంది వాతావరణం. ఎజెండాలో ఇంకా పది, పంద్రెండు విషయాలున్నాయి, చర్చించడానికి. 'టంగని' నాలుగంటలు కొట్టింది; కౌన్సిలు హాలులోని గడియారం. అప్పటికింకా ఐదు అంశాలు ముగిశాయి. కాని లంచ్ టైమ్ అయిపోతూందని విచారిస్తున్నట్టు కనబడ్డాడు, రావు. కౌన్సిలర్లు మాట్లాడుతూంటే, ఏదో వినక తప్పదన్నట్లు వింటున్నాడు. ఆ చివరలో ఒక కౌన్సిలరు ఏదో మాట్లాడుతున్నాడు. ఒక్కసారి గొప్పగా ఆవులించాడు రావు.

హనుమంతరావు విశ్వేశ్వరపురం మునిసిపాలిటీకి ఛైర్మన్. ముఖ్యంగా మునిసిపాలిటీని ముందు ఘనతకు తీసుకరావడానికి ఆ మీటింగు చాలా ముఖ్యమైనా, ఒక్కొక్కసారాతనికి ఆ కౌన్సిల్లో తాను లేకుండా వుండివుంటే బాగుండేదనిపించేది. ప్రస్తుతం కూడా అలాగే తలుస్తున్నాడాతడు. ఆ దినం టౌను ప్లానింగు కమిటీకి అధ్యక్షతను వహించాడు. కమిటీ మెంబర్లు క్రొత్తగా కట్టుతూన్న మెటర్నిటీ హోమ్‌ను గురించీ, దాని ప్రారంభోత్సవాన్ని గురించి చర్చిస్తున్నారు. హనుమంతరావు ప్రక్కనే కూర్చున్న వెంకోబరావు, వైస్ ఛైర్మన్ లేచి, "మన క్రొత్త హోమ్‌వద్ద ఒక శిల్పాన్ని మనం, ఆ శుభదినాన్ని స్మరించేందుకు, నెలకొల్పాలి. ఆర్థికంగా ఇది ఉచితమని తోచకపోవచ్చు. అయినా మన మునిసిపాలిటీ ప్రతిదినం ఇలాంటి హోముల్ని కట్టించడం లేదు. నా సలహాను గురించి మన ఛైర్మనుగారు ఏమి సెలవిస్తారు..." అని మాట్లాడాడు.

"ఆ, ఏమన్నారు? వెంకోబరావుగారు", అనిఏదో నిద్రనుండి లేచిన వ్యక్తి విధంగా మాట్లాడాడు హనుమంతరావు.

'ఏమీ లేదండి. నేను మిమ్మల్ని మన హోమ్ ముందొక విగ్రహాన్ని నెలకొల్పితే బాగుంటుందా, అని అడిగాను' అన్నాడు తిరిగి వెంకోబరావు.

"మీ సలహా చాలా బాగుంది. కాని... అయితే..." అని ఒక్కసారిగా యోచనలోనికొచ్చాడు హనుమంతరావు.

కొంతమంది కౌన్సిలర్లు 'అయితే మరేమి' అని ఏక కంఠంతో తిరువనంతపురం సోదరులవలె మాట్లాడారు.

సీరియస్‌గా లేచి హనుమంతరావు, 'మరి నా అభిప్రాయాన్ని మీకు తెల్పుతున్నాను. ఆ హోమ్ దాని పరిసరప్రాంతం, ఇకముందు మన భార్యలవల్లను, ఊరిలోని మహిళామణులవల్లను, ఉపయోగింపబడుతుంది. దీని విషయాన్ని మనం నిర్ణయించడంకంటె, మన సభ్యులయొక్క భార్యల నంబరిని ఒక సబ్‌కమిటీగా ఏర్పాటు చేసి, వారినే ఏ విధమైనటువంటి శిల్పాన్ని ఎక్కడ స్థాపించాలి, అనే విషయాన్ని నిర్ణయించడానికి విడిచిపెడితే చాలా బాగుంటుందని అనుకుంటున్నాను. మనది స్వతంత్ర భారతదేశం కాబట్టి స్త్రీపురుషులకు సమానబాధ్యతలున్నాయి వారికి కూడా బాధ్యతలు వహించగల అవకాశాలు మనం ఇస్తేనే కాని, మన స్త్రీల సమర్థతను తెలుసుకోలేం. ఈ విషయాన్ని మన రాజ్యాంగంకూడ నొక్కి చెప్తూంది. అందువల్లనే ఈ సలహా నేను సభవారికిస్తున్నాను" అన్నాడు హనుమంతరావు.

శ్రీ తిరుమల
శ్రీనివాస రాఘవన్

చేయికి చేయి తోడ్పడే విధంగా వెంకోబరావు తక్షణం, 'ఛైర్మనుగారు సెలవిచ్చింది అక్షరాలా మనమందరం విచారించవలసిన విషయం. మనం ఏదో నగ్నంగావుండే ఏ గ్రీకో లేక అజంతా శిల్ప సౌందర్యపు కాపీని తెచ్చి నెలకొల్పితే, మన స్త్రీలలో చాలమంది ఒప్పుకోరు. నేను ఛైర్మనుగారి సలహాతో పూర్తిగా సహకరిస్తున్నాను." అని అన్నారు.

'హియర్, హియర్' అని గట్టిగా అందరూ బల్లలమీద చేతితో గుద్దారు. శబ్దం తిరిగి చల్లబడిపోయింది.

'పైవిషయం మీరందరు తీర్మానం చేసినట్లు తలచి, నేను నా భార్యయైన శ్రీమతి హయవదనాదేవిని, సబ్‌కమిటీని ఏర్పాటు చేయమని, ప్రారంభోత్సవానికి తగినట్లు శిల్పాన్ని నిర్ణయించమని ఈ సభవారు కోరినట్లు, ఆమెకు నేను తెలుపుతాను. ఈ తీర్మానానికి సభవారందరూ ఒప్పుకున్నారనుకుంటున్నాను' అని హనుమంతరావు మాట్లాడుతూంటే 'ఓ యస్' అని కౌన్సిలర్లు తమ ఆమోదాన్ని తెలిపారు. ఆ అంశాన్ని పెన్‌తో టిక్ చేసి ఇంకో అంశానికి వెళ్ళాడు. అటుపిమ్మట ఐదు టిక్స్ అయిన తర్వాత, బయటపడి తన ఇంటివైపు జట్కాను తిప్పమన్నాడు హనుమంతరావు.

లంచ్ టైమ్ అయిపోయినా తన భర్త రాలేనందుకు హయవదనాదేవి కాచికాచి, లోపలి కెళ్ళింది. వెళ్ళిన ఐదు నిమిషాలలోనే జట్కాబండి చప్పుడు వినబడింది బయట. ఆమె బయటికివచ్చి భర్త జట్కానుండి దిగటాన్ని చూచి తిరిగి లోపలి కెళ్ళింది. ముఖం కడుక్కొని, హనుమంతరావు నిమ్మళంగా కుర్చీలో కూలబడ్డాడు.

'దేవీ... దేవీ...' అని గట్టిగా పిలవడంతోనే హనుమంతరావు ముందు ప్రత్యక్షమైంది కాఫీ టీఫనుతో హయవదనాదేవి.

'కాదండీ, ఎందుకింత లేటండీ ఈ దినం?'

'ఆ, ఏమీ లేదు. ఏదో మీ ఆడవాళ్ళ విషయం. నీకొక విషయం చెప్పనా!'

'ఊ, ఏదో కానీయండి.'

'మన ఊళ్ళో ఇహ రెండు నెలల్లోపున మెటర్నిటీ హోమ్ తెరవాలి. ప్రారంభో



"మీరు శిల్పులండీ. నేను మీ ప్రశంసకు తగని దాన్ని"

త్సవం బ్రహ్మాండంగా జరగాలని మే మందర మనుకున్నాము. ఆ ఉత్సవం శాశ్వతంగా పురజనుల జ్ఞప్తిలో నిలిచిపోడానికి గాను ఒక శిల్పాన్ని నెలకొల్పాలనుకున్నాము. ఇలాంటి విషయాల్ని స్త్రీలే నిర్ణయించడం మంచిదని, నన్ను సబ్ కమిటీ నొకదాన్ని నియమించమని, నేను మునిసిపాలిటీ పరంగా కోరుతున్నా. ఎప్పుడూ మగాళ్ళే, ఆడవాళ్ల విషయాల్ని నిర్ణయించడం బాగుండదన్నాను.'

'ఏమండీ, నిజంగానే చెబుతున్నారా?'

'ఓ, నిజంకాక ఈ విషయంలో తప్పు చెబుతానా ఏంటి?' అంటూ కాఫీని చేతికి తీసుకున్నాడు. ఆమె—

'అలాగైతే చాలా ధన్యవాదాలండి మీకు. ఇన్నాళ్లకు తెలిసిందండి ఈ ఊరి మునిసిపల్ కౌన్సిల్‌కి జ్ఞానోదయ మైనట్టు. నే ననుకున్నదానికంటె మీ కౌన్సిలర్స్‌కి ఎక్కువ బుర్రవుందని నా కిప్పుడు తెలుస్తూందండి. అయితే వుండండి. ఆఫీసులో కెళ్ళి పేపరు, పెన్సిలు పట్టుకొస్తా' అంటూ, ఆమె వెళ్ళి తిరిగివచ్చి, హనుమంతరావు ప్రక్కన కూర్చుంది.

'దేవీ, తెలుసుగా నాకు నీ సామర్థ్యం, అందుక నే నిన్నక్కడ ఉంచాను.'

'పెళ్లాకోళ్ల మెందుకులెండి. చూడండీ. నాకు తెలిసినవాళ్లలో శ్రీ వెంకోబరావు గారి భార్య శ్రీమతి వెంకాయమ్మగారు, శ్రీ బిందూరావుగారి భార్య శ్రీమతి సులోచనాదేవిగారు, శ్రీరామచంద్రా రెడ్డిగారి భార్య శ్రీమతి లక్ష్మమ్మగారూ, కొత్తగా వచ్చిన మేజస్ట్రేటు భార్య శ్రీమతి సునందినీ దేవిగారు...ఆ...మరచిపోయాను మొన్న నే వచ్చిన లేడీ డాక్టరు....ఇప్పటికే చాల మందయ్యాము. చాలుకదూ...'

'అయితే ఆ క్రొత్తగావచ్చిన నర్సు నళినీ దేవి సమాచారం?'

'నేను మాత్రం ఆమెను చస్తే వేసుకోను.'

'ఆమె లేక పోతే పోనీ, ఆ విశాలాక్షినెందుకు వేసుకోకూడదూ. ఆమె కప్పుడే ఇద్దరు పిల్లలున్నారు. ఆమె ఇంతలోనే ఇంకోపిల్లను కనబోతూంది'

'ఆ నాకు అదే ఆశ్చర్యమేస్తూంది. ఒక డజను ఎందుకు కనలేదని పాపం'

'ఆమె భర్త చాల గొప్ప శిల్పిటగా చాల మంచివాడట...'

'నే నాతన్ని ఎప్పుడూ గౌరవిస్తానండి, కాని ఆమెనుమాత్రం నేను సహించలేను. కావలసివస్తే, సబిన్‌స్పెక్టర్ భార్య రాగమ్మగారిని చేరుస్తాను'

'ఏదో నీకిష్టమొచ్చినట్లు చేయి' అంటూ



# ప్రారంభోత్సవం



హనుమంతరావు సిగరెట్టు ముట్టించాడు.

'అలాగేనండి... మీ రిక్కడే వుండండి. నేను వెళ్ళొస్తాను,' అని హుషారుగా లోపలికెళ్ళింది.

* * *

శ్రీమతి హయవదనాదేవిగారి అధ్యక్షత సభ చేరింది. సభ్యులు చాలా ఉత్సాహంగా మాట్లాడుతూన్నట్టు తోచింది. అప్పుడప్పుడు, 'సైలెన్స్' అని వినబడుతూంది. కడకు ఒక నిర్ణయానికి వచ్చారు. కొంత చురుకు వాగ్వాదాలు జరిగింతర్వాత ఆ సభవారు శ్రీమతి హయవదనాదేవి ఒక యువకశిల్పినిచూచి మాతృత్వాన్ని స్ఫురింపచేసే ఒక రాతిశిల్పాన్ని నిర్మించడానికి ప్రయత్నింపవలసినదనిన్నీ, ఆ శిల్పాన్ని ఆ మెటర్నిటీ హోమ్ ముందు నెలకొల్పాలనిన్నీ, మాతలు కాబోయేందు కక్కడికి వచ్చే యువతులందు ఒక విధమైన గౌరవ ప్రపత్తులు కలగేలాగ ఆశిల్పాన్ని తయారు చేయించాలని నిర్ణయించారు.

'సోదరీమణులారా! మనం ఈదినం చాలా గొప్పవిషయాన్ని సాధించాము. నేను మద్రాసుకెళ్ళి ఒక గొప్ప యువక శిల్పిని దర్శించడం, చేయవలసిన పనుల్లో చాల కష్టమైంది. అయితే మీ రందరూ నాలో చూపిన ఆదరాభిప్రాయాల వల్లనే నీపనికి పూనుకుంటున్నాను...' అని హయవదనాదేవి మాట్లాడుతూంటే ముసి ముసి నవ్వులు సభ నావరించినవి. అంతలో ఆమె, 'ఇంతటిలో సభ ముగిసింది. ప్రక్కహాలులో టీ ఏర్పాటుచేయబడ్డది. అందరూ అక్కడికి వెళ్ళాలని ప్రార్థిస్తున్నాను.' అని అనడంతో కరతాళధ్వనులు మారుమోగాయి.

హయవదనాదేవిగారు వివిధ యాన్ని పట్టుకున్నా దాన్ని సులభంగా విడిచిపెట్టరు. తన మనస్సునంతా ఖర్చుచేసి పని చేస్తుందావిడ. ఒక యువక శిల్పికోసం వెదకటానికి మొదలెట్టింది. మద్రాసులో ఒక మంచి శిల్పున్నాడని తెలియవచ్చింది. అతని ఎడ్రస్ సంపాదించగలిగింది. ఇదంతా చాల బాగుంది. కాని కమిటీ నిర్ణయించిన ప్రకారం విశ్వేశ్వరపురస్త్రీలు ఆ శిల్పానికయ్యే ఖర్చును భరించాలి. అన్ని సమస్యలకంటే ఈ డబ్బును ప్రోగుచేసే సమస్య చాలా కష్టంగా తోచింది. ధైర్యాన్ని వదలక హయవదనాదేవి వివిధ వ్యక్తులకు, సంస్థలకు జాబులువ్రాసింది. కాని ప్రయోజనం లేకపోయింది. ఇక తప్పదని మహిళాసంఘం వలంటీర్లు దళాల ద్వారా ఇంటింటికి వెళ్ళి విరాళాన్ని ప్రోగుచేయించింది. కట్ట కడపటికి 2000 రూపాయలు ప్రోగుచేయబడ్డాయి.

మద్రాసుకు భర్తగారి సెలవుతీసుకొని బయల్దేరింది, హయవదనాదేవిగారు. ఆమెలోని అంతెరుగని ఆనందం, ఆమె పెదవుల్లో విరిసింది. సెకండ్ క్లాస్ టికెట్టు తెచ్చి జవాను ఆమెను రైల్లోకూర్చోపెట్టి తాను మూడో తరగతిపెట్టెలో ప్రయాణం చేశాడు.

మరుసటిరోజు అడ్రసు తీసుకొని, అలమేలు మంగాపురాన్ని చేరుకున్నారు. దారిలో చిక్కిన వారినల్లా అడిగారు. ఆర్టిస్టు వెంకట్రావు బసయేదని. ఎవరూ చెప్పలేదు. కొంతసేపు గాలించిన పిమ్మట ఒక బోర్డు చూచారు, దగ్గరికెళ్ళి చూస్తే 'ఎవర్ షైన్ స్టుడియోస్ - ఆర్టిస్టు వెంకట్రావు" అని వుంది. బాగానే వుందని, హయవదనాదేవి (అక్కడికెళ్ళి) తలుపు తట్టింది, హృదయం పరుగెత్తుతూంటే.

తలుపు తెరుచుకుంది. ఒక యువకుడు చక్కని గడ్డంతో ప్రత్యక్షమయ్యాడు. చిరునవ్వుతో అతను స్వాగతమిస్తూ, 'రండి, రండి. అల్లా కూర్చోండి. అచ్చంగా... ఎంత అందంగా వున్నారండి మీరు మీ పెంట్రుకలు' అని అన్నాడాయన. కొంతవరకు హయవదనాదేవి అతను మాట్లాడే వైఖరిని చూచి భయపడింది. ఆశ్చర్యపడింది. కాని ధైర్యంగా, 'మీరు శిల్పులండీ నేను మీ ప్రశంసకు తగనిదాన్ని' అనిందామె.

'ఎప్పటికీ నేను వూరికే ముఖస్తుతి చేసే వాణ్ణికానండి. ఎందరో వచ్చారు. కొన్నేళ్ళు వెనకాల సినిమా వాళ్ళొచ్చి పోయారు. వాళ్లను ప్రశంసించానేంటి? నేను ప్రకృతిలో చూచే సౌందర్యాన్ని వ్యక్తుల్లో చూస్తేగాని వాళ్ళ సౌందర్యాన్ని గురించి నేను పొగడను' అన్నాడు. 'క్షమించండి' అంటూ ధైర్యంగా, 'ఏమైనా ఈ ఆర్టిస్టులవద్ద అక్కర్లవద్ద మాట్లాడటం చాలా కష్టం. మేము విశ్వేశ్వర పురాన్నుంచి వచ్చాము...' అనిందావిడ.

'ఊఁ' అంటూ నేలపైపు చూశాడు దీర్ఘంగా అతను.

'మేమొక సంఘాన్ని స్థాపించాము.'

'ఏమైనా నాటక సంఘమా?'

'అబ్బే లేదండీ, మహిళాసంఘం విశ్వేశ్వర పురవిషయం మీకు తెలిసుంటుందనుకుంటాను. విశాఖపట్టణం తాలూకాలోని ముఖ్యకేంద్రమండి'

'ఆ, తెలిసేవుండి వుంటుందిలెండి. కాని నావల్ల మీ కేమి సహాయమౌతుందండీ?' అన్నాడా శిల్పి.

'మావూరి మున్సిపాలిటీ పరంగా ఇక్కడికి వచ్చాను. మీరు మాకొక మంచి శిల్పాన్ని నిర్మించి ఇవ్వాలండి' అంటూ నలుమూలలా చూచిందావిడ. ఏముందీ, ఒక మూల ఒకకర్షకుడు నాగలి నెత్తుకున్న బొమ్మ. క్రింద చినిగిన చాప, ఉలులు, సుత్తులు, నేలమీద పెన్సిలుతో రాసుకున్న స్కెచ్‌లు ఆమెకు కనబడినాయి.

'అయితే మీకెలాంటి శిల్పం కావాలి, నాకు సాధారణంగా పనంతా పక్కా బిజినెస్ తీరుగా వుండాలి...' అన్నాడాతడు.

'చూడండి, మేము క్రొత్తగా ఒక మెటర్నిటీహోమ్ కట్టుతున్నాం. ప్రారంభోత్సవానికి గాను ఒక లేతయువతి ప్రతిమను ప్రతిష్ఠిద్దామని అనుకున్నాం.'

'చాలా మంచి ఊహ. లేత యువతి లలామ మరి ఆమెను అజంతా శిల్పాలవలె చిత్రించమంటారా లేక ఆధునికంగా ఉండేట్టు నిర్మించాలా?'

'సాధారణంగా, ఈ కాలంలో ప్రసవించిన స్త్రీలు యేవిధంగా వుంటారో ఆవిధంగా నిర్మించాలి' అంటూ హయవదనాదేవి నొక్కి చెప్పింది.

'మీరు వేరువిధంగా తలచకపోతే చెప్తాను. చూడండి శిల్పి, నగ్నరూపంలో తాను తలుచుకున్న భావనల్ని ప్రతిబింబింపచేయవచ్చు. కొంతవరకు కృత్రిమంగా రూపాన్ని బట్టల్తో కప్పినప్పుడు అపని శిల్పి కసాధ్యమౌతుంది. అందుకే గ్రీకు,

"ఏమండీ! యీ హోటలు స్థాపించి చాలా రోజులైనట్టుంది?"

"అవునండి! పందొమ్మిది వందలా యిరవై రెండులో స్థాపించాను"

"అలాగా! ఈ మైసూరు పాకు, యీ జిలేబీ యివన్నీ కూడా ఆనాటి ప్రారంభోత్సవానికి తయారు చేసినవే కాబోలు!"

—గోపీశ్రీ,

అజంతాశిల్పాలు గొప్ప స్థాయి నందు న్నాయి,' అని గడ్డాన్ని సర్దుకుంటూ, కళ్ళుమూసుకొని 'ఒక ఆవిడ, తెల్లని చీరలో, ముఖంలో గంభీరత, చిరునవ్వు కనబడుతూంటుంది. చేతుల్లో ఒక శిశువు ...ఆ శిశువు మగాడుగా వుండాలా లేక...' అని ఆమె వైపు నవ్వుతూ చూచాడు.

'మీ ఇష్టం ప్రకారమేనండి' అన్నదావిడ.

'అలాగైతే మగాడుగానే చిత్రిస్తాను. మీ విశ్వేశ్వర పురజనులకి కూడా ఇష్ట మనుకుంటాను మగశిశువంటే. ఈ వెధవ, పెండిండ్లుగాక బాధపడే తండ్రులని చూస్తే, మగాళ్ళకి మంచి గిరాకీ ఉందండి' అంటూ సిగరెట్టు ముట్టించాడు.

'అంతా మీ ఇష్టం ప్రకారమే' అనింది హాయవదనాదేవి.

'అలాకాదండీ మిమ్మల్ని ఒప్పించడం మాకర్తవ్యం,' అంటూ ఒక పేపరు పట్టుకొచ్చి, స్కెచ్ వ్రాసి ఆమెకిచ్చాడు.

'ఎంతబాగుందండీ. నిజంగా నా మనసులోవుండే భావాన్ని ఎంత చక్కగా చిత్రించారు' అనిందామె.

వెంకట్రావు నవ్వుతూ, 'చాలా మంచిదండీ - మరి మీరు నాశిల్పానికెంతివ్వాలనుకున్నారు సాధారణంగా...' అని మాట్లాడుతూంటే 'మీరేమీ భయపడనక్కర్లేదు. మేము 2000 రూపాయలు ప్రోగుచేశాం' అనింది హాయవదనాదేవి. తృప్తిని చూపిస్తూ, 'సరేలెండి ముందు నేను శిల్పానికి మోడెల్ ఒకటి ప్లాస్టర్ ఆఫ్ పారిస్ చేసి మీకు పంపుతాను. మీరు దాన్నొప్పుకున్నతర్వాత, డబుల్ లైఫ్ సైజ్ లో మంచి తాయిలో చెక్కుతాను' అన్నాడు శిల్పి.

'చాలా మంచిదండి. ఆ విగ్రహాన్ని మా హోమ్ తెరిచేంతవరకు ఇక్కడే దాచి వుంచాలి...'

'ఓ. దానికేమిలెండి. మీకు ఏ దినం కావలసివస్తే, ఆ దినం నేనే దాన్ని మీ వూరికి తీసుకొచ్చి నెలకొల్పుతాను. నా ఈ శిల్పం నిజంగా నా జీవితంలో ఇంతవరకూ చేసిన వాటిలోకి మాస్టర్ పీస్, కొంచె ముందండి. కాఫీ తెప్పిస్తాను'

'ఎందుకండీ'

'అలాకాదు. కూర్చోండి' అంటూ వెంకట్రావు ప్రక్కరూములోనికెళ్లి వచ్చాడు.

*  *  *

శ్రీమతి హాయవదనాదేవిగారు మళ్ళీ ...డ్ కమిటీకి అధ్యక్షతను వహించారు. ...మె తాను రైల్లో కూర్చున్నప్పటినుంచీ ...రిగి తాము ఇల్లు చేరేవరకు, జరిగినకథను ...భ్యులు అందరూ డంగయ్యేట్టు 'తు,చ' తప్పకుండా వివరించింది. తన వివరణలో తాను ఆగొప్ప ఆర్టిస్టుతో కాఫీ పుచ్చుకోవడాన్ని గురించి నొక్కి చెప్పింది. సభ్యులంతా హాయవదనాదేవి పనిని శ్లాఘించారు.

'ఎంత చక్కగా వున్నాడండీ ఆ శిల్పి, వెంకటరావు! మంచిఫాలం నలని గడ్డం-బంగారు చాయ... అయితే ఆయన

# ★ "ప్రారంభోత్సవం" ★

స్టూడియో మాత్రం పాతఫక్కీలో వుందండి. ఆయన నాకు కాఫీ ఇచ్చి సత్కరించారు.' అని చెప్పటానికి మొదలెట్టింది హాయవదనా దేవి భర్తతో.

'అలా అయితే చాలా మంచివాడల్లే వుండే ఆశిల్పి, మన శిల్పాన్ని గురించి అన్ని విషయాలు ఆయనకు చెప్పావా?' అని అన్నాడామె భర్త.

'అకేమిటండీ అలా అంటారు. చక్కని యువతీ, మాత, చేతుల్లో బిడ్డనెత్తుకొని ఉంటుంది. డబుల్ లైఫ్ సైజ్ లో ఉంటుంది. అతడొచ్చి మన హోమ్ ముందు దానిని నిలబెట్టితే మనం రెండువేలరూపాయలీవలసుంటుంది'

'అబ్బో, అంతే'

'మరేమి! వంకాయల వ్యాపారమను కున్నారా? దాన్ని మనం ఓపెన్ చేసిం తర్వాత చుట్టుప్రక్కలవుండే వాళ్లంతా చూడటానికి వస్తారు. చూడండి మన ప్రాంతంలో అలాంటి శిల్పాన్ని చూసి వుండరు' అంది ఉత్కంఠతో హాయవదనా దేవి.

కొంతకాల మయింతర్వాత, ఒకదినం ప్రొద్దున ఉత్తరమొకటివచ్చింది. హనుమంతరావు కుర్చీలో కూర్చొని ఏదో పేపర్లు తిరిగేస్తున్నాడు. 'ఏమండీ ఒక మంచి వార్త' అంది హాయవదనా దేవి నవ్వుతూ.

'ఏమిటి! త్వరగా చెప్పు'

'అంత తొందరెందుకండి. మన శిల్పి వెంకట్రావు రాశాడు, శిల్పాన్ని అంతా తీర్చాడట-వెయ్యిరూపాయలు పంపమని వ్రాశాడు. పంపనా?'

'అలాగే పంపించు,' అంటూ ముక్కు ద్దాలు సరిజేసుకున్నాడు, హనుమంతరావు.

ఇంక రెండు దినాలు మాత్రముంది ప్రారంభోత్సవానికి. హాయవదనాదేవి చాల విచారంగా వుంది శిల్పివద్దనుంచి ఉత్తరం రాలేదని. శిల్పంకూడ విశ్వేశ్వర పురాన్ని చేరలేదు. ఏమి చేయటానికి తోచ లేదామెకు. అంతలో 'టెలిగ్రామ్ సార్' అన్నాడు జవాను. ఒక్కసారిగా దాడు తీసింది గుమ్మంవద్దకు. త్వరగా కవరు విప్పి చూచింది. అందులో - ఆర్టిస్టు సాయంకాలానికి వస్తున్నట్లు, విగ్రహాన్ని రవానా చెయ్యడానికి చిక్కువచ్చినందువల్ల ఆలస్యమైనట్లు వుంది.

కొంత మనసు కుదుటబడ్డది. వేయి కళ్లతో సాయంకాలానికి వేచివుంది. ఐదుగంటలయ్యేటప్పటికి ఇంటి ముందు వాన్ హారన్ వినబడింది. డ్రైవర్ ప్రక్కన కనుపించాడు వెంకట్రావు. వాన్‌ను హోమ్ వద్దకు తీసుకెళ్ళమని చెప్పింది. శిల్పాన్ని ఆవిష్కరించే ముందు ఎవ్వరూ చూడ కూడదని ఆ స్థలానికి చుట్టూ టార్పాలిన్స్ ముందే కట్టించారు. దాని లోపలికి తీసు కెళ్ళారు. అప్పటికే చీకట్లు విరిసింది.

పెందరాళే లేచి వెంకట్రావు హోమ్ దగ్గరికి వెళ్లాడు. కొంతమంది పనివాళ్ళ సహాయంతో తొమ్మిదిగంటలకంతా శిల్పాన్ని నిలబెట్టారు. ప్రొద్దున ఎండలో మెరిసిపోతూంది, ఆ విగ్రహం.

'రావుగారు ఎంతత్వరగా నిలబెట్టే శారండీ ఆ శిల్పాన్ని, సాయంకాలం నేను రాలేక పోయానండీ, క్షమించండి.' అంది చేతులు జోడించి, హాయవదనా దేవి.

'దానికేమిలెండి. పరవాలేదు. శిల్పాన్ని

గురించి మీ అభిప్రాయ మేమండి!' అన్నాడు వెంకట్రావు.

'అద్భుతంగా వుందండి. నిజంగా వండర్‌ఫుల్! కొంచం పనుంది. తిరిగి మిమ్మల్ని కలుసుకుంటాను," అని అంటూ హాయవదనా దేవి తిరిగి జట్కా ఎక్కి వెళ్ళిపోయింది.

ప్రారంభోత్సవ దినం మాత్రం ఉదయం చాలా ఉత్సాహంగా వుంది. రకరకాల పూలకుండ్లను ఆ శిల్పంచుట్టూ అమర్చారు. చుట్టూ పదిగజాల దూరంలో కుర్చీలు వేయబడ్డాయి. త్రివర్ణపతాకం హోమ్‌మీద ఎగురుతూంది. రంగు కాగితాల తోరణాలు ఆకాశాన్ని అలంకరించినవి. మేళగాళ్లు వాయిస్తున్నారు 'ఏతీరున నను దయ చూచెదవో ఇనవంశోత్తమ రామా' అనే కీర్తన. ఊరిలో పెద్ద మనుష్యులు జల్తారు రుమాలులు, టోపీలు పెట్టుకొని హాజరయ్యారు. ఇంక మహిళల మాటెందుకులెండి. సీతాకోకచిలుకల్లాగ తయారై హాజరయ్యారు. వారినందరిని హాయవదనా దేవి కూర్చోబెట్టుతున్నది. పత్రికల వాళ్లు కెమేరాలు తగిలించుకొని కూర్చున్నారు. అందరికంటె వీళ్ళకి ముందుగా ఆహ్వానాలు పంపబడ్డాయి. లేకపోతే పబ్లిసిటీ ఎక్కడొస్తుంది!

తొమ్మిదిగంటలు కొట్టేసరికి స్థలమంతా జనంతో నిండిపోయింది. రావలసినవారంతా వచ్చారు. మున్సిపాలిటీ వైస్ చైర్మన్ వెంకోబరావు ముందుకొచ్చి, సభకు ఛేర్మను శ్రీ హనుమంతరావుగారిని అధ్యక్షత వహించవలసినదని కోరుతూ, మంత్రిగారు ఏదో కొన్ని చెప్పరాని కారణాలవల్ల రాలేకపోయారని తెలిపారు. పిమ్మట మెటర్నిటీహోమ్‌ను గురించి మున్సిపాలిటీ చేసిన ప్రయత్నాల్ని తెలిపే నివేదిక చదివారు. శ్రీమతి హాయవదనా దేవిగారిని శిల్పాన్ని ఆవిష్కరించవలసిందని కోరారు. హాయవదనా దేవి లేచి గంభీరంగా, "మేము మీరందరు కోరినప్రకారం ఈదినం ఈ మెటర్నిటీహోమ్‌ని ఓపెన్ చేస్తున్నాము. నేనీ కార్యాన్ని చాల గర్వంతో చేస్తున్నాను. ఈ శిల్పాన్ని మన ఊరి మహిళలు వారి శ్రద్ధారూపంగా సమర్పించారు. ఇప్పుడు నే నావిష్కరించబోయే శిల్పం యావద్భారతదేశ యువతీమాతల కందరికి ఆదర్శంగా వుందని..." అని అంటూ, "రావుగారూ! దాన్నెలా తెరవటం?" అని అడగడంలో, "అదా రాన్ని లాగండి" అన్నాడు వెంకట్రావు. క్షణంలో దాన్ని లాగేసింది.

శిల్పాన్ని చూడడంతోనే కరతాళధ్వనులు చెలరేగినై. మేళం గొప్పగా వాయించారు, 'కళ్యాణి'లో. గుంపులోని వాళ్లు శిల్పం దగ్గరికెళ్ళి చూడాలని త్రోసుకుంటున్నారు. తిరిగి కొంతసేపటికి శాంత వాతావరణం ఏర్పడింది. నళినీదేవి మాత్రం ఆ శిల్పంవైపు తీక్షణంగా చూస్తూంది. ఆమె చుట్టూ ఉన్నవాళ్ళు, 'ఎంతబాగుంది విగ్రహం...ఆ...' అని అంటూంటే, ఏదో నళినీదేవి రాగమ్మగారి చెవిలో వూదింది. గట్టిగా నవ్వటానికి మొదలెట్టారు. ఆ నవ్వు అందరికీ వినబడింది. ఆ నవ్వుకు కారణమేమిటని, తక్షణం హాయవదనాదేవి రాగమ్మదగ్గరి కొచ్చి, 'ఏమండీ సమాచారం?' అన్నది.

'అదేమండీ హాయవదనాదేవిగారూ! చూడండి విగ్రహాన్ని. ఆ యువతీమాతలో పెండ్లిచేసుకున్న లక్షణాలే కన్పడవు కదండీ. పెండ్లికి చిహ్నంగా కాళ్ళకు మెట్లెన్నా లేవుకదండీ. బాగుంది. పెండ్లి కాకనే బిడ్డల్ని కనాలనా మీ ఆదర్శం,' అని పల్కింది రాగమ్మ.

'నే నన్నీ సరిపెడతా - మీ రూరుకుండండి,' అంటూ తిరిగి హనుమంతరావు ప్రక్క కూర్చుంది. ఆయనకు రాగమ్మ చెప్పిన విషయం తెలిపింది. 'ఈ విమర్శలంతా ఇప్పుడెందుకు. కార్యక్రమం జరగనీ...' 'అలాగంటే ఎలాగండీ? ఊరిలోనివాళ్ళు నవ్విపోతారు' అని చెప్పి వెంకట్రావు సలహా కోరింది హాయవదనాదేవి. ఈవిధంగా హాయవదనాదేవి తికమకలాతూంటే, ఎట్లో కొంతసేపట్లో సభికులందరికీ ఆసంగతి తెలిసిపోయింది. అందరూ గట్టిగా నవ్వటానికి మొదలెట్టారు. హాయవదనాదేవికి విపరీతంగా భయమేసింది. ఏదో సరిపెట్టమనింది వెంకట్రావుని. వెంకట్రావు లేచి సభికుల నుద్దేశిస్తూ, 'ఈ వూరిలోని మహిళలంతా చాలా అభ్యుదయ పంథాకు చెందినవారని తలచాను. నా శిల్పం కూడ దానినే తెలుపుతూంది. కాని స్త్రీజాతికి నేను అపచారం చేశానని మీరు తలుస్తున్నట్లు నాకవగతమైంది. అందువల్ల మీ సంశయాన్ని తీర్చడానికి ఈ వెండి ఉంగరాల్ని ఆ శిల్పసుందరి వేళ్లకు తొడుగుతున్నాను. నే నందుకని వదిలిపెట్టాను. మీరు దానిని కావాలంటున్నారు. నేను మీ కోర్కెల్ని కాదనలేను. ప్రజాశిల్పిని కాబట్టి,' అంటూ ఆ శిల్పసుందరి కాళ్ల వ్రేళ్లకు ఆ వెండి ఉంగరాల్ని తొడిగాడు. సభికులంతా శిల్పిప్రతిభకు మెచ్చుకున్నట్లు చప్పట్లు చరచారు. పిమ్మట శిల్పి వెంకట్రావుగారికి హాయవదనాదేవిగారు, వెయ్యిన్ని నూట పదహారు రూపాయల్ని బహూకరించారు. సభ 'జనగణమన'తో ముగిసింది. ★

# ఒక నాటి పెళ్లి

రైలు కుదుపు శరీరానికి ఒకవిధమైన, సుఖవంతమైన కదలిక కనిపిస్తూ వుంది. ఆ పెట్టెలో మాట్లాడే రకరకాల మనుష్యుల మాటలుగాని, రైలు యింజను చేసే రణగొణధ్వనిగాని, అప్పర్ బర్తులో పండుకున్న నా నిద్రకు ఆటంకం కలిగించలేదు. రైలుబండి ఒకమాదిరిగా వూగుతూ పరుగెత్తుతూవుంటే, నేను కాళ్లు చాచుకొని పండుకుంటే, ప్రక్కలనుంచి చల్లగాలి వీస్తుంటే, యేదో హాయిగా, మగతగా కన్ను మూసేను. అలా యెంతసేపు నిద్రపోయేనో తెలీదు.

"అలా చూస్తారేం? ఆ పెట్టె అందుకొని అక్కడ కాళీస్థలంలో పెట్టండి" అన్న స్త్రీ కంఠం ఖంగున మ్రోగి నా నిద్రకు భంగం కలుగజేసింది. బరువుగానున్న కనురెప్పలు తెరవాలని ప్రయత్నం చేసేను. సాధ్యం కాలేదు.

"అయ్యో! పెట్టె అందుకుని వూరుకుంటారేమండి! బుట్టకూడ అందుకొని ఆ పెట్టెమీద పెట్టండి" మళ్ళీ రింగుమంది ఆ స్త్రీ కంఠం.

కనురెప్పలమీద నీళ్ళు చల్లినట్లయింది. కొద్దికొద్దిగా కండ్లు తేలికపడ్డాయి. శరీరమంతా బరువుగా, యేదో మత్తుగా వుంది. హోరున వర్షం కురుస్తూవుంటే, భోరున గాలి వీస్తుంటే, గాలికి కూఅని యింట్లో, వెచ్చని పరుపుమీద, వున్నికంబళీ కప్పుకొని పండుకున్నంత హాయిగా ఆనందంగా వుంది.

"అయ్యో! ఖర్మమా! ప్రతీదీ చెప్పాలటండీ? ఆ పండ్లబుట్ట ప్రక్కకు నెట్టి, ఆ పెట్టెమీద మిగతా ఖాళీలో కూర్చోండి. నేను, పాప, యీమూల కూర్చుంటాం. యిక్కడ ఖాళీఅవగానే యిక్కడ కూర్చుందురుగాని" మంచి రాగస్థాయిలోనున్న అయ్యారుకంఠంలా పలికిం దా కలకంఠి! యెవ్వరీ రమణీలలామ? యేమి ఆ వాక్చాతుర్యం? ఎవ్వరా మాగభర్త? రెప్పలు తెరవకపోయినా చూడాలనే కోరిక నెమ్మదిగా మొలకెత్తి, క్రమంగా, బలంగా కనురెప్పలు విప్పేవరకూ వూరుకోలేదు.

అవిడను, ఆయనను ఒక్కసారి దర్శనం చేసుకున్నాను.

రైలు వేగంగా ముందుకు పరుగెడుతూంటే, నా ఆలోచనలు కిటికీల్లోనుంచి కనుపించే మిట్టపల్లాల్లాగ, చెట్టుపుట్టల్లాగ, వెనక్కి పరుగెత్తడం మొదలెట్టేయి. యింతా అంతా వెనక్కి కాదు. పదిసంవత్సరాలు వెనక్కి. నేను 4 వ ఫారం, మా అన్న స్కూలుఫైనలు చదివే ఆరోజులకి, నేను హాఫ్ ఫేంట్లు, పొట్టిచొక్కాలు తొడిగే ఆరోజుల్లోకి, నన్ను అమాంతంగా లాక్కుపోయేయి. అంతటితో వూరుకుంటేనా? మా అన్న స్నేహితుడు శశిరావు వివాహానికి, బంధువర్గంకూటంలోనికి, మేళతాళాల్లోనికి లాక్కుపోయేయి.

శ్రీ కావూరి
నరసింహశెట్టి

"అలా వీల్లేదండి. నా స్నేహితులకు ముందుగా 4 దస్తాల పేకలు, 6 సెంటుబుడ్లు, 4 స్నో సీసాలు, 2 దువ్వెనలు, 8 సబ్బులు, 5 తువ్వాళ్ళు, 8 అద్దాలు, 12 సిగరెట్ పెట్టెలు, పంపించండి తొందరగా" అంటున్నాడు పెండ్లికొడుకు.

"అదేమిటి నాయనా! యీ పల్లెటూరిలో యివన్నీ యెక్కడ దొరుకుతాయి" అంటుందో ముసలికంఠం భీతితో.

"దొరక్కపోతే వెంటనే యెవరికైనా ప్రక్క టౌనుకు సైకిలుమీద పంపించండి. స్నేహితుల్లో నాకు తలవంపులు రావడానికి వీలు లేదు. పల్లెటూరట - పల్లెటూరు! అలాంటివాళ్ళు పల్లెటూరి సంబంధానికే పోలేకపోయేరూ టౌనువాళ్లసంగతులు తెలుసుకోకుండా, టౌనుపిల్లవాడికి అందులోనూ స్కూలుఫైనలు చదివేవాడికి పిల్లనివ్వడానికెందుకు పూనుకోవాలి?"

"యింత చిన్నదానికి అంతలేసి మాటలెందుకు నాయనా? తెప్పిస్తానన్నానుగా"

"అనడంతో సరిపోదండి మామగారూ. పనులు జరిగితేనే మాట దక్కుతుంది. మీరు వృథాగా టైము పాడుచేయకండి. స్నేహితులు వచ్చే టైమయింది" వృద్ధమూర్తి జాలిగా, సన్నగా జారిపోయేడు.

రైలుబండి సాగిపోతోంది రణగొణ ధ్వనితో.

* * *

"యింత బైతు లనుకోలేదు వీళ్ళని" అన్నాడు పెండ్లికొడుకు.

"వూరుకోరా తమ్ముడూ. అయిందేదో అయిపోయింది"

"అదికాదేఅక్కా! యింత మడ్డుమ్మగాలయితేమాత్రం బెల్లం కాఫీ యిస్తారా? అయ్యో. నా స్నేహితుల్లో నా గౌరవమంతా చంపేసేరు అక్కయ్యా! యింత పాడుసంబంధం చూచేవేం బావ. పోనీ ఆ స్నేహితులమట్టుకైనా పంచదార కాఫీ యివ్వనక్కరలేదూ?"

"అబ్బ! వూరుకోరా. నీవూ నీ స్నేహితులూ కలసి చేసినపనికి వాళ్లంతా సిగ్గుపడుతూనే వున్నారు. యింకెందుకులే వూరుకో."

"వూరుకోక యేంచేస్తాను? పోనీ ఆ పెండ్లికూతురైనా చెప్పొద్దూ"

"దాని మొహం. దానికిమాత్రం యేం తెలుసురా?"

"అయ్యో! డాక్టరు గారూ! పావలా కాసు మింగేశా నండి."

"అరె! ఎప్పుడుమింగావు?"

"నాలుగు రోజు లైందడి."

"మరి యిన్ని రోజులు ఏం చేస్తున్నావు?"

"నాదగ్గిర యింకా ఏదో కొంతడబ్బు వుంటే, అదే వాడు కొంటూ గడిపానండి."

—శ్రీ ములుకుట్ల చలమయ్యశాస్త్రి (కాకినాడ)

"కాఫీలో పంచదార వెయ్యాలని తెలియకపోతే రేపు పట్నంలో నాతో కాపురం వెలగబెట్టినట్లే."

"క్రమంగా అదే నేర్చుకుంటుంది లేరా"

"నేర్చుకుంటుందంటే యెవరు నేర్పుతారే అక్కా, నేను ఆఫీసుకు వెళ్ళడం మాని దానికి వంట నేర్పుతూ కూర్చుంటానా?"

"అబ్బో! చాలావరకూ పోయేవురా. యింకా నీ స్కూలు ఫైనలు పరీక్షా ఫలితాలు తెలియనే లేదు. అప్పుడే ఆఫీసుకు పోయేవరకూ వచ్చింది"

"వుద్యోగంచేయక వూరికే వుంటానా?"

"అప్పటికి నీ పెళ్లాం అన్నీ నేర్చుకుంటుందిలే"

"యేమో! అదీ వట్టి మడ్డుమృగంలా కనిపిస్తూ వుంది."

"తప్పురా! యెవరైనా వింటే బాగుండదు"

"యెలాగైనా దానికి తరిఫీదునిచ్చి పట్నవాసం పిల్లలా తయారు చేయాలి."

*　　*　　*

"యేం నాయనా! నోటికి వచ్చినట్లల్లా మాట్లాడి, చేతికివచ్చినట్లల్లా చేయడమేనా? మీ పెద్దభావమరది గ్లాసులతో కాఫీ తెచ్చి యిస్తే, నీవు, నీ స్నేహితులు గ్లాసులు దూరంగా విసిరేసేరట"

"యింకా నయం మామగారూ. నా స్నేహితులు మంచివాళ్ళు గనుక అలా చేసేరు. మరొకళ్ళయితే ముఖంమీద కొడుదురు"

"తప్పురా తమ్ముడూ. పెద్దవాళ్ళతో అలా మాట్లాడవచ్చునా"

"ముఖంమీద కొట్టడానికి వాడేం తప్పుపని చేసేడు బాబూ"

"యింకా అడగడానికి వచ్చేరా? టౌనులో చదువుకునే కుర్రాళ్ళకి బెల్లం కాఫీ యిస్తారటండీ"

"అదా నాయనా తప్పు? యెంత తప్పు చేసేడు! యీ పెండ్లిలో యెంతమంది నీ పెంకితనం గురించి చెప్పుకుంటున్నారో విన్నావా బాబూ"

"చెప్పుకోనివ్వండి పల్లెటూరి బైతులెన్ని చెప్పుతున్నా నాకు భయంలేదు."

"ఒరే శశీ! పెద్దవాళ్ళనే భయంలేకుండా మాట్లాడుతున్నావు. మామగారూ! వాడి కింకా చిన్నతనం. నేను మందలిస్తాను. మీరు వెళ్ళండి" ముసలిరూపం సణుక్కుంటూ సాగిపోయింది.

కిలకిలా నవ్వులు వినిపిస్తూవుంటే పెండ్లి పందిట్లో నేమో ననుకున్నాను. కాదు రైలుపెట్టెలో, మళ్ళీ నిజపరిస్థితుల్లోనికి వచ్చేను. ఒకవేళ నేను పొరబడ్డానేమో ననుకుని మళ్ళీ చూచేను. సందేహంలేదు. పదిసంవత్సరాల క్రిందట పెండ్లిపందిట్లో అంత హంగామా చేసిన ఆ శశిరావే మళ్ళీ యిన్నాళ్ళకు, యీ రైలుపెట్టెలో సతీ సమేతంగా కనుపించేడు. ఆమె అతని భార్యయే. అదిగో పెండ్లినాడు నేనూ మా అన్నయ్య చూచి నవ్వుకున్న ఆమె గడ్డం క్రింద చిన్నకాయ. ఆ దంపతుల సంభాషణయే ఆ పెట్టెలోని వారల నవ్వులకు కారణమయ్యింది. కాని పెండ్లిపందిట్లో నవ్వులు కాదు. "అలా తూలిపోతున్నారేమిటి?" ఆనాటి పెండ్లికూతురు యీనాటి బిడ్డతల్లి సుశీల కంఠం నవ్వులమధ్య కంచు గంటలా మ్రోగింది.

"చోటు చాలడంలేదు." నెమ్మదిగా గొణిగేడు శశిరావు.

"బాగానే వుంది పట్నవాసం తెలివి. ఆ బుట్టతీసి బల్లక్రిందకునెట్టి, పెట్టెమీద సరిగా కూర్చోండి"

ఆనాడు పులిలా అందర్నీ హడలెత్తించిన ఆనాటి శశిరావు యీనాటికి పిల్లిలా మెదలకుండా చెప్పింది మాత్రమే చేయగలుగుతున్నాడంటే-భార్యామణి అధికారంలో, యీ పదిసంవత్సరాలలోనూ అతని వ్యక్తిత్వం యింత దిగజారిపోయినందుకు నేనెంతో జాలిపడ్డాను. ఆరంభంలో శూరత్వం చూపే వీరనాయకుల గాథలన్నీ కడకు యిలాగే కళాహీనంగా, నిస్సారంగా, నిరుత్సాహంగా నిర్గమిస్తాయేమో!

"వద్దు వద్దుర బాబోయ్ - పెళ్లొద్దుర బాబోయ్" అంటూ 'పల్లెటూరి పిల్ల' సినీమాలో లప్పాం, టప్పాం గాళ్ళు పాడిన పాట పాడుతూ యిద్దరు బిచ్చగాళ్ళు రైలు పెట్టెలో ప్రవేశించేరు.

మాటలాగిపోయేయి; నవ్వు లణగిపోయేయి. బిచ్చగాళ్ళు పాడుతున్నారు. రైలు పరుగిడుతూనే వుంది.

"ఒద్దుర బాబోయ్ - పెళ్ళొద్దుర నాయనోయ్" అని ఒకడంటే—

"సొగసు లెన్నో జరిగిపోయె, సగం ప్రేమ సాగిపోయె ఒద్దంటే యిప్పుడెలాగోయ్ - ఓయ్ గురువా?" అంటున్నాడు రెండోవాడు.

పెట్టెలోనివాళ్ళంతా ఫక్కున నవ్వుతున్నారు. వాళ్ళతోబాటు శశిరావు, సుశీల కూడ నవ్వుతున్నారు. యెవ్వరెందుకు నవ్వుతున్నారో తెలీదు మరి. ★

# అల్లుడి ప్రయాణం



పాత్రలు:

ఆనందరావు: కథానాయకుడు (అల్లుడు)
రామారావు: ఆనందరావు స్నేహితుడు.
మాధవరావు: ఆనందరావు తండ్రి.
శాంతమ్మ: ఆనందరావు తల్లి.

(మాధవరావు యిల్లు. ఆనందరావు, రామారావు)

రా: ఏమిటి బ్రదర్ అలా దిగులుపడి కూర్చున్నావేం?

ఆ: ఏముందోయి జీవితంలో కల్లా చిక్కైన సమస్య వచ్చి పడింది.

రా: అదేమిటోయి. ప్రక్కన నావంటి మిత్రుడుండగా యింకా భయమెందుకు? నిన్ను ఎటువంటి కష్టంలోంచి అయినా వడ్డు కీడ్చుకురానూ?

ఆ: నిజమే అందుకనేగా. నీకోసం ఎదురుచూస్తు కూర్చున్నది.

రా: రైట్. మిత్రుడంటే ఆ మాత్రం నమ్మకం వుందన్నమాట. ఏదీ నీ సందేహాన్ని విననియ్యి.

ఆ: సందేహానికేముంది లేగాని చెప్పాలంటే...

రా: సిగ్గుగావుంది కాబోలు.

ఆ: అవునోయి.

రా: అంత సిగ్గుపడే విషయం ఏముంది చెప్మా. ఏమీ తెలియటం లేదే. నువే చెప్పవోయి.

ఆ: ఆ మాత్రం కనుక్కో లేనివాడవు యింకా సలహా ఏమిస్తావులే. సరే. నిన్ను బాధపెట్టటం ఎందుకు? ఇదిగో యీ వుత్తరం చూడు.

రా: (వుత్తరం చదివి నవ్వుతూ) హరి. ఇదటోయి సంగతి. చంపేశావు. పండక్కి మామగారు వుత్తరం వ్రాశారని సంతోషించటం పోయి సమస్య అంటావేమిటోయి.

ఆ: వుండవోయి నాయనా! నీకేం తెలుస్తుందీ బాధ. అత్తవారింటి కెళ్లటం అంటే హల్వా తినటం అనుకున్నావా! అలాగా ఎన్ని ప్రాణాలుబాధపడ్తున్నాయి.

రా: అత్తవారింటి కెళ్లటం అంటే ఎగిరిపడాలిగాని సిగ్గుపడటం దేనికి? ఆఁ ఇంతకీ నీ బాధేమిటో చెప్పలేదే.

ఆ: చెప్పనిస్తే కదూ, అది కాదోయి. ఇదే ప్రథమం కదూ. అక్కడ ఏలా సంచరించాలో ఏమిటో తెలియక చచ్చిపోతున్నాను. (విసుగ్గా) ఏమిటో వెళ్లకపోయినా బాగుండును.

రా: విసుక్కుంటే ఏలా మరి? నన్నడగవోయి చెప్తాను. అయినా నీ స్నేహితుడిని అయినందుకు గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవటమేనా ఏమిటి? నీ భయం పోగొట్టి లాలించి, ధైర్యవంతుడిగా చెయ్యటం నావిధ్యుక్త ధర్మం కాదటోయి. మాట్లాడవేం? అయినా అంత సిగ్గూ, అంత ధైర్యం, మొగవారికి తగదోయి.

**శ్రీ కొంపల్లి కోటిలింగం**

ఆ: ఏం మాట్లాడేది? సరే చెప్పు.

రా: ఇంతకీ నీభయం అక్కడ ఎలాగ మెలగాలనే కదూ.

ఆ: అవును మరి. ప్రారంభించు.

రా: సరేనయ్యా. నీకు రిస్టువాచి లేదు కదూ.

ఆ: ఊహూ.

రా: ఇబ్బంది లేదులే. ఈ నాలుగు రోజులూ నే నిస్తాను. ముందు నువ్వు వెళ్లేటప్పుడు మహా టిప్‌టప్‌గా వుండాలి.

ఆ: అదేనయ్యా బాబూ. ఎలాగో చెప్పమనేది.

రా: విను. నీకు బట్టలు మంచివే వున్నాయిగా. మొన్న వేశావే. ట్వీడ్ డ్రెస్సు. వెళ్లేరోజున అది ధుమాయించేసేయి. నే నిచ్చే రిస్టువాచి తగిలించుకో. కూలింగ్ గ్లాసెస్ వున్నాయి కదూ. ఇంకేం పోకుకి లోటులేదులే. వింటున్నావా?

ఆ: చెప్పవోయ్.

రా: ఆ! ఇంకా షైకన్ను బూట్సు వుండనే వున్నవాయె. అబ్బో. యింకేం! దొరగారిలాగ తయారవు. చేతిలో కర్చీఫ్ హాజరుగా వుండాలని తెలుసుకదా! రైలు ప్రయాణంలో జుత్తురేగకుండా చూసుకో. బ్రిలియంటైన్ పూసేస్తే అణిగిపడుంటుందిలే.

ఆ: ఇవన్నీ చెప్పుకోస్తావేమిటి? ఇవేం తెలీనివా ఏం?

రా: అదే మరి. చెప్తే ప్రారంభంనుండీ రావాలి. నాలుగయిదు సూట్లు సూట్‌కేస్‌లో పెట్టేసెయ్యి.

ఆ: అన్నెందుకు! నాలుగురోజులే కదా వుండేది?

రా: వుండాలయ్యా స్వామీ వుండాలి. రోజుకో సూటు మారుస్తూవుండు. సరే అప్పుడే మధ్యలోకి వెళ్ళిపోతున్నాం. స్టేషన్‌కి మామగారో, బావమరిదో ఎవరో వస్తారులే. ఇప్పటిరోజుల్లో మామగారు రారు. వస్తే బావమరిదే రావాలి. లేకపోతే అదీ వుండదు.

ఆ: అసలుకన్న వుపోద్ఘాతం ఎక్కువగా వుంది.

రా: అందులోనేవుంది అందం. బావమరిది వస్తే కాఫీనీళ్ళు పోయించు. మర్చిపోయాను. రిక్షాలో ఎక్కబోక. ఇప్పటిరోజుల్లో అది ఫ్యాషన్ కాదు.

ఆ: మరి ఎలా వచ్చేదోయ్. నడిచి వెళ్లమంటావేమిటి?

రా: అబ్బెబ్బె. మీ అత్తగారివూరు బస్తీయేకదూ. టాక్సీ లుంటాయిలే. ఒక అయిదు రూపాయలు పోతేపోయాయి అందులోనే వెళ్ళు.

ఆ: చంపేస్తున్నావు. డబ్బంతా వెళ్లేటప్పుడే ఖర్చు చేసెయ్యమంటావేమిటి?

రా: మొదటిసారి వెళ్ళేటప్పుడు ఆ మాత్రం దర్జా లేకపోతే ఎలాగ? నువ్వన్నట్టు అత్తగారింటికి వెళ్ళటం హల్వా తినటమా ఏమిటి?

ఆ: కాదులే. చెప్పు.

రా: కారులోంచి దిగగానే మామగారు

వచ్చి కుశల ప్రశ్నలు అడుగుతారులే. జాగ్రత్తగా సమాధానం చెప్పు. (కొంచం నవ్వి) తలుపు సందుల్లోంచి ఎవరయినా వీక్షిస్తున్నారేమో పరీక్ష చేస్తూ వుండు.

ఆ: (సిగ్గుగా) అబ్బ పోవోయి.

రా: సిగ్గు పడటం సహజమేలే. మొదటిసారి నాకూ అలాగే అయింది. సరే వెళ్లంగానే నువ్వు కట్టుకున్న సూటువిప్పేసి మామూలు బట్టలు వేసుకో. మరదళ్లెవరయినా వున్నారా.

ఆ: ఆహా యిద్దరు.

రా: అయితే చిక్కే. పకోడీలు పెడ్తే జాగ్రత్తగా చూసి తిను. కిళ్లీలు పరీక్షచేసి నములు. నేనయితే ఆ కిళ్లీలు జేబులో తోసేసి బజారునుండి తెచ్చుకున్న కిళ్లీలు నమిలేసేవాడిన్ని. తర్వాత చూస్తే వాటి నిండా రాళ్ళు, కారం అబ్బా చాలా వుండేవిలే.

ఆ: ఏమోనోయి. నా మరదళ్లు అసలే గడుగ్గాయిల్లా వున్నారు. ఏం చేస్తారో ఏమో.

రా: అందుకనే జాగ్రత్తగా మెలగాలి. ఎందుకయినా మంచిది బావమరుదలని మంచి చేసుకో, సినిమాలకు తీసుకెళ్తూ వుండు. హోటల్సుకికూడ తీసుకుపోతూ వుండులే. సర్దాపుడితే రాయబారిగా వుపయోగించుకో.

ఆ: చంపేస్తున్నావోయ్.

రా: ప్రమాదం లేదులే. రోజూ డ్రెస్సు మార్చేస్తూ వుండమని చెప్పానుగా. మూగవాడిలాగ కూర్చోకుండా మరదళ్లను దగ్గిరేసుకుని కబుర్లు చెప్తూవుండు. వీలయితే ఏడిపించేస్తూ వుండు. మర్చిపోయాను. అన్నిటికయినా ముఖ్యమయిన విషయం.

ఆ: ఒక్కొక్క విషయం ఒక్కొక్క ప్రాణం తీసేస్తున్నాయి. ఏమయినా తప్పని సరి. సరే చెప్పు.

రా: భోజనాలవిషయంలో నువ్వు వద్దన్నా కొద్దీ వడ్డించేస్తూవుంటారు. కడుపు పండిపోతున్నా తినెయ్యబోక. సాధ్యమయినంతగా వదిలేసెయ్యి. అంతగా ఆకలి అవుతే హోటల్సువున్నాయనుకో. అత్తగారింటికి వెళ్లటం కేవలం అత్తగారితో, మామగారితో, మరదళ్లతో, మరుదులతో మాట్లాడటం కోసమే కాదు.

ఆ: ఇంకెవరున్నారోయ్.

రా: చంపేశావు. అందరికన్నా ముఖ్యమయిన అసలు కథానాయిక లేదుటోయ్, ఓరచూపు చూస్తూవుండు. వీలయితే హాట్లాడేసెయ్యి.

ఆ: నీమాటలు నాకేం అర్థం కావటం లేదోయి.

రా: అక్కడకు వెళ్ళినతర్వాత అదే అవుతుందిలే. గాజుల గలగల వినిపిస్తే వృధాగా పోనియ్యకు.

ఆ: ఇంకేమయినా విషయాలు వుంటే చెప్పవోయ్.

రా: టిఫిన్‌కూడ సగం సగమే కానిస్తూ వుండు. అక్కడ ప్రొద్దుపోవటానికి ఏమయినా పుస్తకాలు తీసుకోమరి. మర్చిపోయాను. ప్రెజంటేషన్‌గా ఏమయినా తీసుకువెళ్తున్నావా?

ఆ: ఆ విషయమే మర్చిపోయానోయ్. ఎవరెవరికి తీసుకపోవాలేమిటి?

రా: మిగతావారికి తీసికెళ్ళినా, తీసుకుపోకపోయినా యిబ్బంది లేదు. కథానాయికకు చీర తీసుకుపోకపోతే ఎలాగ?

ఆ: చంపుతున్నావోయ్. తీసుకుపోయినా యివ్వటం ఎలాగ?

రా: ఎలాగేమిటోయ్. మరీ పురాతనపు మనిషిలాగ మాట్లాడితే ఎలాగ? వీలుచూసి కబుర్లలోకి దింపి తీసికెళ్లింది ముట్టచెప్పిరా.

ఆ: సరే నీమాటకు ఎదురుందా?

[శాంతమ్మ ప్రవేశం]

శాం: ఏమిటోయ్ రామం. ఇద్దరూ



"సిగ్గుపడటం సహజమేలే. మొదటిసారి నాకూ అలాగేఅయింది."

# ★ అల్లుడి ప్రయాణం ★

కూర్చుని రాచకార్యాలు జరుపుతున్నారు.

రా: ఏమీ లేదండీ. ఏవో...ఆనం దానికి నూరిపోస్తున్నాను.

ఆ: ఏమిటోయ్ నూరిపోసేది. అన్నీ కోతలమ్మా. ఏమీ లేదు.

రా: అమ్మముందు రహస్యమేమిటోయ్. ఏమీ లేదండి శాంతమ్మగారూ! మన అబ్బాయికి అత్తగారింటికి వెళ్లటమంటే సిగ్గుగా వుందిట. అందుకని...

శాం: అందుకని సిగ్గుతీరుస్తున్నావు కాబోలు. బావుంద్రా. ఎలా అయినా మా అబ్బాయికి తగని సిగ్గోయ్ రామం.

రా: అందుచేత నేనండీ నూరిపొయ్యటం. వింటున్నావా ఆనందం. అంతసిగ్గు పనికి రాదోయ్. ఎంతయినా అత్తవారింటికి పోవటం సిగ్గేమిటోయ్.

ఆ: (విసుగ్గా) అబ్బ. నన్ను చంపకండి. ఎప్పుడూ వేళాకోళా లేనా ఏమిటి?

రా: ఉన్నమాటంటే వులుకెక్కువట. సరేలే. మధ్య నాకెందుకు? ఏమండోయి శాంతమ్మగారూ! స్నేహితుణ్ణి కాబట్టి నా ధర్మం నేను నెరవేర్చుకున్నాను. ఆపైన అతని యిష్టం.

శాం: అవున్లే బాబూ! ఏమో యీ కాలం కుర్రాళ్ళని నమ్మలేం. మొదటిసారి యిలాగే అంటారు. ఇక తర్వాత యింట్లో వుండమన్నా వుండరులే.

ఆ: (కొంచం కోపంగా) వుండక ఎక్కడికెళ్తా నేమిటి?

శాం: అదే తెలుస్తుందిలే అబ్బాయి. నీలాంటివాళ్లు ఎంతమంది 'వెళ్లం వెళ్లం' అని చెప్పి తీరా వెళ్ళింతర్వాత అక్కడినుంచి రాలేక గింజుకులాడుతున్నారు?

రా: మన ఆనందం అటువంటి రకం కాదులెండి.

శాం: ఆఁ ఏంకాదో అంతా మాయ. చెప్పలేం బాబూ, ఆగస్మాత్తుగా చిన్నప్పట్నుంచీ పెంచి పెద్దచేసిన తలిదండ్రుల్ని మరిచిపోతారు.

ఆ: (కోపంగా) ఇంక ఆ పురాణం ఆపరా అమ్మా మీగోల. అసలు యిలా గోల పెడితే నేను వెళ్లనే వెళ్ళను.

శాం: ఇదెక్కడి గోల అబ్బాయి. చదవేస్తే వున్న మతి పోతుందన్నారు. ఇంకెప్పుడూ యిలా అనబోక. ఎవరన్నా వింటే నవ్వి పోగలరు.

రా: అబ్బే అవన్నీ డాబులులెండి. మీరు మాట్లాడ కూరుకోండి. ఎందుకు వెళ్లడో చూస్తాను.

శాం: ఏమో నాయనా! అసలే తిక్క మనిషి.

రా: మీకేం పర్వాలేదండి. నేనున్నాను కదా. మీరు, నేనూ కలిసి వేళాకోళాలాడితే సిగ్గుపడ్డాడు.

ఆ: సిగ్గుకాదు. నేను వెళ్ళను.

శాం: ఆఁ ఆఁ చూశావా నాయనా వున్నకొద్ది పెచ్చు పెరుగుతోంది.

రా: మీరుండండి, ఏదోకోపంవచ్చింది. నేను సరిచేస్తానుగా. (మంచిగా) ఆనందం! ఆనందం! ఏమిటోయి కథ. చెప్పవేం.

ఆ: కథాలేదు గిథాలేదు. నా కిష్టం లేదు. నేను వెళ్ళను. బలవంతం ఏమిటి?

శాం: చూశావా నాయనా! తిక్క తిరిగితే వాడంతే. ఏమో రామం బాబూ! నువ్వే ఎలా అయినా మనస్సు తిప్పెయ్యి.

రా: 'మీరేం గాబరాపడకండి. ఏమోయి ఆనందం! అలా అంటున్నావేమిటోయ్.

ఆ: చెప్పానుగా నాకిష్టం లేదని నన్ను విసిగించబోకండి.

రా: సరేలే. అలా వదిలేస్తే అది ధర్మం ఎలా గవుతుంది. కోపం మాని అసలు సంగతి చెప్పవోయ్.

ఆ: (విసుగ్గా) అయితే చెప్పెయ్యమంటావా?

రా: ఊఁ.

ఆ: లేకపోతే ఏమిటోయ్ వాళ్ళ మర్యాద. వాళ్ళు వచ్చి తీసుకెళ్ళాల్సింది పోయి వుత్తరంముక్క రాస్తే వస్తానునుకున్నారేమిటి?

రా: (నవ్వి) చంపేశావోయ్ అంతమట్టుకు సంతోషించు. నా మట్టుకు నాకు వుత్తరం ముక్కయినా రాలేదు. అయినా వూరుకున్నా నేమిటి! పండగ పదిరోజులు వుందనగానే వెళ్లిపోయాను.

శాం: అసలు రాత్రినుంచీ ఒకటే గోల పెడుతున్నాడోయి రామం! తను వెళ్ళనంటాడు. నాకు తెలియక అడుగుతాను. అదేం మర్యాదోయి.

ఆ: వాళ్ళు వుత్తరం ముక్క రాసి రమ్మనటం మర్యాదేమిటీ?

శాం: నీకు నేను చెప్పలేనబ్బాయి. నువ్వయినా చెప్పవోయ్ రామం బాబూ.

రా: చెప్తున్నాను కదండి. ఎలాగయినా ఆనందం యీ కాలంలో వుండవలసిన మనిషి కాదండి.

శాం: అదే నాయనా వచ్చినచిక్కు. వుత్త మూర్ఖత్వం.

రా: అసలు అతనికి వెళ్ళటం సిగ్గండీ!

> ఒకావిడ:- ఏమే సుబ్బులూ. నీ పేరు రాధని మార్చుకున్నావేమే?
>
> సుబ్బులు:- ఇప్పటి పద్ధతికి యీ పేరు మోటుగా ఉందని మా ఆయనే మార్చేసేరు.
>
> మొదటి ఆవిడ:- బాగానే ఉంది. అయితే మీ ఆయన పేరేమిటి?
>
> సుబ్బులు- ఆయన పేరు పిచ్చయ్య.
>
> —ఎ. వి. రత్నం, గూటాల.

ఆ కారణంచేత మర్యాద చెయ్యలేదని వేరే వంక పెడుతున్నాడు. అంతేనా ఆనందం?

ఆ: మీరు ఎన్నయినా చెప్పండి. నేను వెళ్ళనిమాట ఖాయం.

శాం: అబ్బబ్బ. ఎంతచెప్పినా వినడేం కర్మ. ఏమిట్రా బాబూ. అటు వాళ్లకూ కోపం వస్తుందె, ఇటు మీ నాన్నగారికీ..

ఆ: ఎవరికి కోపంవచ్చినా లెక్కచెయ్యవలసిన అవసరం కనిపించదు. అసలు యిందులో బలవంతం చేయవలసిన అగత్యం ఏమిటో అర్థంగాకుండా వుంది.

[మాధవరావు ప్రవేశం]

మా: (హడావుడిగా ప్రవేశించి) ఏమిట్రా అబ్బాయి. సిద్ధమయ్యావా?

శాం: ఏం సిద్ధం కావటమో! మీ అబ్బాయి బుర్ర కొంచం వక్రించింది.

మా: అదేం? అలా అంటున్నావ్.

రా: ఏమీ లేదండి. పాపం సిగ్గుపడుతున్నాడు. అతనే వెళ్తాడులెండి.

మా: ఏడిసినట్టుంది. సిగ్గుపడవలసిన సమయమా యిది. ఇప్పుడు పదకొండున్నరయింది. పన్నెండింటికే బండీ. ఊఁ. ఊఁ. త్వరగా తయారవాలి.

శాం: (ఆశ్చర్యంగా) అదేమిటండీ! అంత తొందరగా పంపిస్తున్నారే. రేపుగా వెళ్ళవలసింది.

ఆ: నాన్నగారూ! ఈ విషయంలో మాత్రం బలవంతం చేయకండి.

శాం: చూశారా? అదేనండీ గోల యిందాకట్నుంచీ.

మా: గోలా లేదు గీలా లేదు గాని త్వరగా తయారుకమ్మను.

ఆ: నన్నవసరంగా...

మా : అనవసర మేమిటోయ్ అవతల కొంపలంటుకు పోతుం టేనూ.

శాం : (ఆశ్చర్యంగా) అదేం ?

మా : కోడలుకు జ్వరం బాగా వచ్చేసిం దిట. త్వరగా రమ్మని వైర్ యిచ్చారు. ఇదుగో చూడవోయ్ రామం.

రా : అవునండీ ! అయితే త్వరగా బయ ల్దేరాలి. చప్పున సర్దుకోవోయి సామాన్లు. ఏమోయి ఆనందం.

శాం : ఆఁ ఆఁ కోడలుకి జ్వరం బాగా వుందా ? ప్రమాదం కాదుగదా. అబ్బా యొక్కడే ఏమిటండీ. మనంకూడా వెళ్దాం.

మా : మనం ఎలా వెళ్తామే. వరే ఆనంద్. నువ్వెళ్ళగానే ఎలాగుందో వుత్తరం రాయి, తప్పని సరి అయితే మేమూ వస్తాం.

ఆ : (జాలిగా) పోనీ మీరు కూడ రారాదూ అమ్మా !

మా : మాకు వీలు ఎలా అవుతుందిరా ? ఇక్కడ పాడీ అదీ వుందా ? వెళ్లంగానే వుత్తరం రాయమన్నానుగా.

శాం : పోనీ రామం ! నువ్వు వెళ్ళ వోయ్. అబ్బాయికి సాయంగా.

రా : వెళ్ళటానకి నాకేమీ యిబ్బంది లేదుగానీ యిక్కడ నాకు అర్జంటుగా కోర్టు పనులు ఏడిశాయి సమయానికి. అన్నీ సమ యానికే వస్తాయి.

శాం : (భర్తతో) అసలు మీకు వైరు ఎలా అందింది ! ఆఫీసుకు వెళ్ళారుగా.

మా : ఆఫీసుకే వచ్చింది. సరే త్వరగా బయల్దేరమను. నేను మళ్ళీ వెళ్లిపోవాలి.

రా : రావోయి ఆనందం ! చప్పున బట్టలు సర్దుకో. స్టేషన్ దాకా వస్తాను.

ఆ : ఉండవోయి. నన్ను అగాధంలో వదిలిపెట్టి వెళ్లిపోయారు. ఆఖరికి నువ్వుకూడ యిలా మోసం చేస్తావనుకో లేదోయ్.

శాం : ఏం చెయ్యనుమరి. నాకుమాత్రం నిన్ను అన్యాయం చెయ్యటం సరదానా ఏమన్నానా ?

మా : ఊఁ, యింకా యిక్కడే కూర్చు న్నారూ. త్వరగా బయల్దేరాలి. టైము అయిపోతూంది.

శాం : ఉత్తరం రాస్తావు కదూ. అక్క డకు చేరుకోంగానే.

ఆ : (కోపంగా)హుఁ. రాస్తాను. మీ కేం ? మీరు కూడ వస్తే నాకీ భారం లేకుండా పోయేదా ? కూర్చుని కబుర్లు చెపుతారు.

మా : కబుర్లు తరువాతోయి. ఇది తప్పితే మళ్లీ ఆరింటిదాకా ట్రయిను లేదు.

రా : అవునోయి ఆనందం. చప్పున డ్రెస్ చేసుకురా.

ఆ : (నిట్టూర్చి) సరే. తప్పుతుందా ?

(లోపలికి వెళ్తాడు)

శాం : అసలుఏంజ్వరమయివుంటుందండీ!

మా : నాకు మట్టుకు ఏం తెలుసు ? కల గన్నానా ఏమియినానా ?

శాం : అహ. ప్రమాదం లేదుగదా అని.

మా : ఏమోనే బాబూ మీ ఆడవాళ్లతో వచ్చిన చిక్కుయిదే. నీ కెంత తెలుసో నాకూ అంతే తెలుసా ?

శాం : ఏమోనండీ నా కంగారు మీ కేం అర్థమవుతుందీ ?

రా : ఏమీ భయంలేదులెండి.ఏమయినా ప్రమాదం వుంటే మన ఆనందం వెంటనే వుత్తరం రాస్తాడుగా.

(ఆనందరావు వస్తాడు).

మా : ఏరా సిద్ధమయ్యావా ? మరివేగం వెళ్లండి. అన్నట్టు డబ్బేమయినా కావాలా ?

ఆ : అక్కర్లేదు.

రా : వెళ్తున్నామండి.

[ఆనందరావు, రామారావు నిష్క్రమిస్తారు.)

శాం : హు. ఏలా అయితేనేం వెళ్లాడు. ఇందాక మీరు లేరుగాని వెళ్ళనని ఎంత మారాం పట్టాడని.

మా : ఏదో పాపం కుర్రతనం. ఎలా అయినా మన అబ్బాయి యీ కాలంలో వుండవలసినవాడు కాదులే. సరేలే. నేనింక ఆఫీసుకు వెళ్లిపోతాను. తలుపు వేసుకో. (నిష్క్రమణ).

శాం : పాపం. వెళ్లనంటే వెళ్లనన్నాడు. చివ్వరికి ఏలాగైతేనేం తప్పనిసరి ప్రయాణ మయింది. అయినా బయటికి చెప్పడుగాని అబ్బాయికి మాత్రం వెళ్ళాలనుండదూ ! భార్యకు జబ్బుగా వుందంటే ముఖం ఎలా మాడిపోయిందో ! అయినా ఏదో... కుర్రతనం. (నిష్క్రమణ). ★

# పత్రత

## 16

## శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తి

మరునాడు శాంతమ్మ ఉదయాన్న ఏమీ ముట్టలేదు. ఒకసారి లేచి మళ్ళీ పడుకుంది. ఈరోజు లక్ష్మే ఇంటి పనులన్నీ చూస్తూంది. రవి ఉదయాన్నే ఖార్ఖానాకు వెళ్లాడు.

తనగదిలో భగవద్గీతను పఠిస్తున్న ధర్మయ్య ఏదో శబ్దం కావడంవల్ల తలెత్తి చూశాడు. లక్ష్మి విసనకర్ర తీసుక వెళు తోంది.

"ఎవరికమ్మా?"

"పొయ్యి రాజటల్లేదు నాన్నా ఊదిఊది కళ్లెంబట నీళ్లుకూడావచ్చాయి...విసురుదామని" అని గదిదాటి వెళ్ళింది లక్ష్మి. మళ్ళీ ధర్మయ్య వెనక్కి పిలిచాడు.

"శాంతమ్మ ఎక్కడ?"

"ఒంట్లో భారంగాఉన్నట్టుంది. ప్రొద్దున్నించీ లేవలేదు" అని చెప్పింది. ఈమాట విన్న ధర్మయ్య చాలా ఆశ్చర్యపడ్డాడు.

"నా కెవరూ చెప్పలేదే" అని కూడా అడిగాడు.

"నాకూ తెలీదు నాన్నా" అని మళ్ళీ లక్ష్మి అంది.

"బాగుంది" అంటూ పుస్తకం ప్రక్కగా పెట్టి లేచాడు. లక్ష్మి వంటగదిలోకి వెళ్ళింది.

"శాంతమ్మా" అని మంచందగ్గరగా నిలబడి ధర్మయ్య పలకరించాడు.

"ఊఁ" అంటూ లేవడానికి ప్రయత్నించింది.

"పడుకోమ్మా ఫరవాలేదు" అన్నాడు. కాని శాంతమ్మ లేచి మంచంమీద కూర్చుంది.

ప్రక్కగా ముక్కాలిపీటమీద ధర్మయ్య కూర్చున్నాడు.

"ఏం? వంట్లో బావుండలేదా?"

"అబ్బే! ఏదో కొంచం భారంగా ఉన్నట్టుంది" అని దీనంగా సమాధానం చెప్పింది శాంతమ్మ.

"వైద్యుణ్ణి పిలవనా?"

శాంతమ్మ కొంచెం కంగారుపడింది "వద్దన్నయ్యా...నాకేమిటో మనస్సు బావుండక పడుకున్నా నంతే" అని నిజం చెప్పింది.

ధర్మయ్య శాంతమ్మ మొగంకేసి చూస్తున్నాడు. ఆమె ఉదాసీనవదనంలో తీరని వ్యథ గోచరించింది. మనస్సు బాగోలేకపోవడానికి కారణాన్ని ఊహిస్తున్నాడు.

"నువ్వు అలా ఊరుకుంటే లాభంలేదన్నయ్యా" అంది. ఈమాట ఎవరిగురించి అంటోందో ధర్మయ్యకుహఠాత్తుగామాత్రం అర్థం కాలేదు. విస్మయంగా ఆమెకేసి చూస్తున్నాడు.

"నిన్న మాశావుగా వాడిప్రవర్తన..." అని మళ్ళీ అంది. ధర్మయ్య గ్రహించాడు. రామువిషయంలో రవి ప్రవర్తన మాడలేదు గాని, విన్నాడు. అయితే ఆ స్వల్పవిషయం గురించి మాతృహృదయం ఇంత క్షోభతో నిండుతుంది అని అనుకోలేదు.

"పిచ్చితల్లీ" అంటూ నవ్వాడు. మళ్ళీ ఈలా అన్నాడు "దానిగురించేనా నువ్వు మంచం పట్టింది"

ధర్మయ్య ఈ విషయాన్ని ఇంత తేలిగ్గా చూస్తాడనుకోలేదు. చినికి చినికి గాలివాన కావచ్చనే శాంతమ్మ నమ్మకాన్ని అతడు అర్థం చేసుకోలేదు.

"నీకు తెలీదన్నయ్యా! రాము వాడికేం విషంపెట్టాడు? రామంటే ఎందుకువిరోధం పెంచుకోవాలి?..అప్పుడప్పుడూవస్తూంటే నామనస్సు కొంత కుదటపడుతుంది. రవి ఈలా ప్రవర్తిస్తే రాము మన గుమ్మం ఎక్కగలడా?" ఈకంఠస్వరంలో ఆత్రంతో పాటు ఆవేదనకూడా కలసింది.

ధర్మయ్య మాటలు వింటూనే ఆలోచిస్తున్నాడు. కాని ఏవిధమైన సమాధానం యివ్వలేదు.

మళ్ళీ శాంతమ్మ "రాము వాడి దృష్టిలో పరాయివాడే కావచ్చు. అంతమాత్రాన్న కలవాళ్ళను విరోధులుగా చేసుకోవడం మంచిదంటావా అన్నయ్యా?" అని అడిగింది.

దానిక్కూడా ధర్మయ్య సమాధానంయివ్వలేదు.

"ఇంతకఠినుడయ్యావేమంటె ... తండ్రి తద్దినం పెట్టనవె వాళ్ళు ఎవరన్నా ఉంటారా?"

ఈ ఆఖరిమాటలు గద్గదికంగా ధ్వనించాయి. ధర్మయ్య లేచాడు. "సరే! మనసు బాగోనప్పుడు పడుకోవడంమంచిది. కాని నువ్వు యింత ఆందోళన పడేంత విపత్తు ఏమీ ముంచుకరాలేదమ్మా ... నేనుండగా నీ కాభయమేమీ అక్కర్లేదు" ... అని తన ఆత్మవిశ్వాసాన్ని వెళ్ళడిచేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

మంచి ఎండలో రిపేరుకొచ్చిన మోటర్ సైకిలెక్కి రవి వచ్చాడు. కారు ధ్వని విని లక్ష్మి వలుపలకు వచ్చి చూసింది. మళ్ళీ తిరిగి లోపలకు వెళ్ళింది.

రవికి స్వంతవాహనం లేనికారణంగా, ఒకసారి సైకిలూ, మరోసారి మోటర్ సైకిలూ, లేకపోతే కాళ్ళ నడకతోనూ యింటికిరావడం పరిపాటి.

చెమట తుడుచుకుంటూ వచ్చిన రవి "లక్ష్మీ" అని పిలిచాడు. లక్ష్మి గదిలోనించి వచ్చింది.

"అమ్మ లేవలేదూ?" అని అడిగాడు.

తెల్లవారుఝాము నాలుగుగంటలకే లేచి పనిపాటలు చూసుకునేశాంతమ్మ, ఈరోజు ఏడుగంటలవరకూ లేవకపోవడం పనిలోకి వెళ్లేముందు చూశాడు.

"లేదు"

"సరే!" చొక్కా తీసి దండేనవేస్తూ "కొంత అన్నంపెట్టు" అన్నాడు.

లక్ష్మి తిరిగి వెళ్ళిపోయింది. రవి తల్లి మంచందగ్గరకు వచ్చాడు. మాసి కొంత

ముందుకు వెళ్ళాడు. మళ్ళీ ఏం ప్రశ్న ఎదురవుతుందో వెనక్కి తిరిగి "అమ్మా" అని పిలిచాడు.

సమాధానం రాలేదు. రవి మళ్ళీ కాస్త బిగ్గరగా "అమ్మా" అని పిలిచి కాళ్ళదగ్గర కూర్చున్నాడు. ప్రక్కగా ఒదిగి పడుకున్న తల్లి తలమీద చేయివేసి "ఒంట్లో ఎలావుంది?" అని అడిగాడు.

"బాగా నేవుంది" భారంగావినిపించింది కంఠం. లక్ష్మి అన్నంపెట్టి అక్కడకొచ్చి నిలబడింది.

"ఏంలక్ష్మీ! అమ్మ ఈలావుందేం?" అమాయకంగా అడిగాడు. లక్ష్మి ఏదో చెప్పాలని నోరు తెరచింది. అంతలోనే తండ్రి గుమ్మంఎదురుగా నిలబడ్డంవల్ల ఆగిపోయింది.

"నీలాంటి కొడుకుని కన్నవాళ్ళు ... అప్పుడప్పుడూ ఈలాఉండటం అలవాటులే ..."అన్నాడు ధర్మయ్య.

వెనక్కి తిరిగి ధర్మయ్య కేసి ఆశ్చర్యంగా చూశాడు. ఆ వ్యంగ్యశరాఘాతం సూటిగా రవి హృదయానికే తగిలింది. తనగురించే తల్లి ఈలా వుందనే సత్యాన్ని వెంటనే గ్రహించాడు.

"నేను చేసిన తప్పేమిటండీ?" మంచం మీదనుంచి లేచాడు. మొదట్నుంచీ గురుభావంతో ధర్మయ్యను చూడ్డంవల్ల ఆ మర్యాదపదం వాడటం అలవాటైపోయింది.

"నీకు తప్పుగా తోచని ప్రతిదాన్ని ఒప్పని అనుకోవడంకూడా ఒక తప్పు... అయితే రాత్రి నీ బాల్యస్నేహితుడి కిచ్చిన ఆతిథ్యం చాలా ఒప్పైందే అంటావ" ఈమాట సూటిగా చూస్తూ ప్రశ్నించాడు.

రవి నివ్వెరపడి మొదటమూశాడు. తిరువాత ఆలోచిస్తున్నాడు.

"కని పెంచి పెద్దచేసిన తండ్రి తనువు చాలిస్తే; సంవత్సరానికి ఒక్కరోజు ఆయన్ని స్మరిస్తూ పిండాన్ని విడవడం కూడా తప్పంటావ్" ఈ మాటలంటూ ధర్మయ్య దగ్గరకు వచ్చాడు. శాంతమ్మ పండుకున్నదల్లా లేచికూర్చుంది.

"రవీ! ఇంటగెలచి రచ్చగెలవడం చాలా మంచిదే కావచ్చు... కాని యింటిల్లిపాదికీ బాధగలిగించే ఒక గొప్పను చూపించినా ఫలితంలేదు... తెలివి ఉంటే నువ్వు నమ్మిన సత్యాన్ని, సహనంగా సాత్వికంగా బోధించి పరివర్తన తీసుకురా! అంతేగాని, దౌర్జన్యంగా నువ్వు అమృత మిచ్చినా విషతుల్యమే అవుతుంది ఏమంటావ్" ఈ ఆఖరి మాట గట్టిగా అన్నాడు. రవి మాట్లాడ లేదు.

"నువ్వు దేశ మాతను కళ్యాణవంతంగా చేయదలస్తే; మాతృహృదయాన్ని బాధపెట్టమని ఎక్కడాలేదు..."

ఈ మాటలతో రవి కాస్త చలించాడు. ధర్మయ్య కేసి విమర్శనాయుతంగా చూస్తూ "ఇప్పుడు నన్ను మీరు ఏంచెయమంటారు" అని అడిగాడు.

"నీ తండ్రి తద్దినం పెట్టడానికి నీ కెందుకిష్టంలేదూ?"

"ఇష్టంలేదు" రవి కంఠం కాస్త కఠినంగా ధ్వనించింది. మాట అన్నతర్వాత, ఎందు కంత గట్టిగా అన్నానా? అని అతనే ఆశ్చర్యపడ్డాడు.

ఈమాటకు ధర్మయ్య మొగం వెలవెల పోయింది. ఈలాంటి సమాధానం వస్తుందని అత నెప్పుడూ ఊహించలేదు. శాంతమ్మ ధర్మయ్య కేసి చూసింది.

"ఎందు కన్నయ్యా! నీ క్రోశమ... వాడి చేతులమీదుగా వచ్చేడబ్బుతో బ్రతికే స్థితి మనకు వచ్చింది...వాడు ప్రయోజకుడయ్యాడు...అందాకా వాడిష్టప్రకారం మనం నడవాలి...ఇంటికెవరన్నా వచ్చినా వాడిష్టంతోనే రావాలి...వాడికి కష్టంగా ఉంటే కానిమాటన్నా పడి ఉండాలి..." శాంతమ్మ ఉద్రేకంగా అంటూ వచ్చిన మాటలు ద్వారా ఆమె కళ్ళల్లో నీళ్ళు, కంఠంలో రుద్ధత, రవి ఎదురుగా ఉండి చూశాడు.

అతనికి మొదట్లో కోపంవచ్చింది. తరువాత ఆవేదన కలిగింది. రవి కళ్ళల్లోకూడా నీళ్ళు తిరిగాయి. మంచందగ్గరగా చతికిల పడి, తల్లి కాళ్ళదగ్గర కూర్చొని "ఎందుకమ్మా మాటలతో నన్నీవిధంగా బాధపెడతావు. నా సంపాదనమీద బ్రతుకుతున్నారని నే నెప్పుడన్నా అన్నానా?... రాముతో మాటాడలేదని నీకు కష్టంకలిగేటట్లయితే అతణ్ని క్షమించమని కోరతాను" అంటూ కళ్ళు తుడుచుకొని లేచి ధర్మయ్యకేసి చూస్తూ "నాన్న పరలోకంలో ఉండి, మనం పెట్టే తిండికోసం చూస్తున్నాడని అమ్మకు నమ్మకముంటే; అది యీనాటి బ్రాహ్మలద్వారా ఆయన కందడమే జరిగితే ఆయన ముట్టనైనా ముట్టడని నాకు తెలుసు...ఇది ద్వేషంతో అనేమాట కాదు...శాస్త్రాలు సృష్టించిన సద్బ్రాహ్మణత్వం...సమసిపోయి చాలాకాలమైంది ...రవి కాస్సేపాగి మళ్ళీ మాట్లాడడానికి నోరు తెరచాడు. ధరయ్య గ్రహించాడు. ఈ మధ్యనే పుస్తకాలద్వారా సంగ్రహించిన ఈ విజ్ఞానం ఉపన్యాసధోరణిలో ఎంత దూరంపోతుందో అతనికి తెలుసు.

"నీ ఉద్దేశం?" ధర్మయ్య తీక్ష్ణంగా చూస్తూ అడిగాడు.

"నాన్నవయస్సులో ఉన్న పేదవాడికి, నాన్నను తల్చుకొని, కడుపారా తిండి పెడితే;..."

"ఆయనకు అందుతుందని నీకు నమ్మకముందా?" అని ధర్మయ్య వేసిన ప్రశ్నకు. రవి మొదట్లో ఏదో అందామనుకొని, ఆ మాట అనడంద్వారా తన నియమానికి ఎంత భంగం వస్తుందో గ్రహించి ఈలా అన్నాడు "నమ్మకం విషయం అటుంచండి. నాన్న పేరుతో ఒకరోజయినా ఒక పేద వాడు సుఖమైన తిండి తినగలుగుతాడు. వాడిహృదయం కృతజ్ఞతతోనిండిపోతుంది. మీ నమ్మకమే నిజమైతే కృతజ్ఞతాపూర్వకమైన ఆ సంతృప్తి నాన్నకు తప్పకుండా అందుతుంది" ధర్మయ్య నవ్వాడు. ఆ నవ్వులో సంతృప్తి ఉంది. శాంతమ్మ యింకా సంశయ హృదయంతో ఆలానే చూస్తూంది. రవిదగ్గరగా ధర్మయ్య వచ్చి "ఆలాగేచేద్దాం...అన్నంచల్లారిపోతోంది. వెళ్లి భోజనం చేయి" అన్నాడు. తల్లి కేసి

(53-వ పేజీ చూడండి)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"




## 120. మనవాళ్లు వట్టి వెధవాయిలా?

"మీ పత్రికలోని విజ్ఞానవీధులు వరుసగా చదువుతూ వస్తూంటే మన ప్రాచీనపద్ధతులు, శాస్త్రాలు వట్టి బూటకాలనీ, పాశ్చాత్య శాస్త్రవిజ్ఞానంముందు అవి గడ్డిపరకంతైనా చెయ్యవని, పాశ్చాత్యులే చాలా గొప్పవాళ్ళు మనం వట్టి వెధవాయిలం అనే అలసత్వభావం నూటికితొంభై తొమ్మిది పాఠకుల్లో (నన్ను కూడ కలుపుకునే) కలుగుతోంది. కాని యీ తేలిక భావం కేవలం వ్రాసే వారిభాషనుండి వస్తోందో లేక హృదయంనుండి వస్తోందో నేను స్పష్టంగా చెప్పలేను. కాని యిటువంటి తేలిక భావాలు యువకుల హృదయాల్లో గాఢంగా నాటుకుంటే భావదాస్యం యేర్పడి జాతీయ భావానికే పెద్ద దెబ్బ తగులుతుందని నా అభిప్రాయం. శాస్త్రవిజ్ఞానంలో పాశ్చాత్యులు మనకన్న ఎన్నో దశాబ్దాలు ముందున్నారన్న సంగతి అందరు ఎరిగిందే. అంత మాత్రంచేత మన ప్రాచీనపద్ధతుల్ని శాస్త్రాలని క్షుణ్ణంగా పరిశోధించనిదే చులకనగా జమకట్టి వ్రాయటం భావ్యంకాదు. ఇంతకీ యీ విజ్ఞాన వీధుల్ని పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రంలో నిధి అయినవారే రాస్తున్నారు తప్ప మన ప్రాచీన శాస్త్రాలని కూడ క్షుణ్ణంగా తెలుసున్నవారు రాయటం లేదేమోననే అభిప్రాయం కలుగుతోంది. ఒక్క ప్రక్క మన ప్రాచీన నాగరికతకు సంబంధించిన విషయాలని సబ్ టైటిల్స్‌తో ప్రచురించి పాఠకుల్ని ఉత్సాహపరుస్తూ మరోప్రక్క విజ్ఞానవీధుల్లో 'మనం వెధవాయిలం' అనే అభిప్రాయం కలిగేలాగ వ్రాయటం శోచనీయం.

ముఖ్యంగా నే కోరేదేమంటే విజ్ఞానవీధుల్ని వ్రాసేవారు మన ప్రాచీనశాస్త్రాలను గురించి వ్రాసేటప్పుడు వెటకారమైన భాష ఉపయోగించకుండా, జాతీయ భావం హృదయంలో వుంచుకొని సున్నితమైన భాషలో వ్రాస్తే పాఠకులకు పాశ్చాత్యశాస్త్రవిజ్ఞానంమీద వుండే గౌరవమూ వుంటుంది, మన ప్రాచీన శాస్త్రాలలో వుండే మంచి చెడుల్ని చులకనగా కాకుండా జాతీయ దృక్పథంతో విమర్శనగా తెలుసుకునే అవకాశమూ వుంటుంది." అని అమలాపురం నించి అ. సూ. ప్రసాదరావుగారు వ్రాస్తున్నారు.

ఈనాటి విద్యాధికుల మనస్తత్వాన్ని చక్కగా వివరించినందుకు శ్రీ ప్రసాదరావుగారికి మా కృతజ్ఞత. "విజ్ఞాన వీధులు" కచ్చితమైన విజ్ఞానాన్ని మా చదువరులలో వ్యాపింపజేయడానికీ, మూఢ నమ్మకాల్ని చేతనయినంత మట్టుకు పోగొట్టడానికీ, సత్యాన్ని వెలువరించడానికీ, ప్రారంభించాము కాని మన ప్రాచీనుల విజ్ఞానాన్ని దుయ్యబట్టడము కోసము కాదు. ఇంతవరకూ వివరించిన ప్రశ్నలన్నిటిలోనూ నూటికి తొంభయి తొమ్మిది ఈ ఆశయాన్నే పాలించుమనని చదువరులకు తెలియకపోదు. అయితే ప్రాచీనులు చెప్పినదానికీ ఆధునిక విజ్ఞానానికీ వైరుధ్యము వచ్చినప్పుడు అది తప్పు ఇది రైటు అని వివరించడము తప్పని సరి. ఇదే మేము చేసిన కానిపని. దీనికే ప్రసాదరావుగారికి అంత కోపమువచ్చినది. 'విజ్ఞానవీధుల్ని' ప్రాచీన శాస్త్రాల్ని క్షుణ్ణంగా పరిశోధించినవారు రాయటం లేదన్నారు. ఇది నూటికి నూరుపాళ్ళూ నిజం. విజ్ఞానంకోసం మేము నేటి వైజ్ఞానికుల పరిశోధనలనే పరిశీలించుకుంటున్నాముగాని "ప్రాచీన శాస్త్రాల్ని" క్షుణ్ణంగా మాట అటుంచి క్రీగంటనైనా చూడడములేదు. అలా చూడడములో మాకు నమ్మకము కూడా లేదు.

క్రీస్తు తరవాత నాలుగూ ఐదూ శతాబ్దాల వరకూ మన ప్రాచీనులు పురోగామి జాతులతో బుజముబుజము కలిపి వైజ్ఞానికావలోకనము చేశారు. గుప్త రాజుల కాలములో భారతీయ సిద్ధాంతులు రోమక పటణమునకు వెళ్ళి సూర్య సిద్ధాంతము నేర్చివచ్చినట్లు సాక్ష్యముంది. భారతీయ సిద్ధాంతి యొకరు అయనచలనానికి పాశ్చాత్యులు కనిపెట్టిన విలవకన్న కచ్చితపువిలవ కనుక్కున్నారు. క్రీ. శ. 476 ప్రాంతంలో జీవించి ఉండిన ఆర్యభట్టు భూమి తన అక్షము చుట్టూ తిరుగుతోందన్నాడు. సున్న, దశాంశ స్థానాలూ, శ్రేఢీ వ్యవహారాలు, అంకెలు భారతీయులు కనుక్కున్నట్లు సాక్ష్యముంది. అయితే ఇస్లాము విజృంభణముతో పశ్చిమ దేశాలకీ భారతదేశానికీ రాకపోకలు కష్టమైనాయి. దేశమే ఇతర జాతుల దండయాత్రలతో కలతపడిపోయింది. బ్రతుకు తెరవే కష్టమైపోతూంటే వైజ్ఞానిక పరిశోధనలు ఎలా సాగగలవూ? పరిశోధనలు మానేసి, శాస్త్రాలు రాయడము ప్రారంభించారు భారతీయులు. తిరిగి, రెండు శతాబ్దాలుగా పురోగామి పాశ్చాత్య జాతులతో సంపర్కము పొందారు. నేడు స్వతంత్రులు. ఈ శుభ సన్నివేశములో తక్కిన జాతులతోపాటు వైజ్ఞానిక పరిశోధనలుచేసి, పరిశోధనల లాభము పొంది పురోగమిద్దామంటారా? లేక, "వేదాల్లో అన్నీ వున్నాయి, వెతకడమే తరవాయి" అని వీపుకి కళ్లు మొలిపించుకుని నిన్నా మొన్నా అటు మొన్నా "మనవారు" రాసిన గ్రంథాలు పరిశీలించుకుంటూ పోదామంటారా?

పోనీ, ఇలా పరిశీలించుతున్న వారు బయటపెట్టిన మహద్విషయాలు ఏమేనా వున్నాయంటారా? "రామాయణంలో విమానాలున్నాయి." అవును మహాప్రభో వున్నాయి, ఏదీ ఎక్కడానికి ఒక్క విమానాన్ని లాక్కురండి రామాయణ ప్రతులన్నిటిలోంచీ! "శంకరభాష్యంలో ప్రోటానులూ న్యూట్రానులూ ఉన్నాయి" అవి మీకు నేటిదాకా ఎందుకు కనబడలేదూ? ఆధునిక విజ్ఞానము 'ఇదుగో పులి' అంటే మీరు 'అదిగో మన శాస్త్రాల్లో



# జంతుకోటిలో మానవలక్షణాలు



(గత సంచిక తరువాయి)

తల్లిలాగా మానవజాతి కంతటికీ పాలిచ్చేది కాబట్టి, గోవుని అన్ని జాతులవారూ అదొకరకమైన మాతృభావంతో చూస్తూంటారు. హిందువులు దాన్ని గోమాత అనే అంటారు; పూజా పురస్కారాలు కూడా చేస్తారు. పైకి అంత సాధువుగా కనుపించే యీ గోవుల్లోకూడా దుర్జనపరత్వం, ఓర్వలేనితనం, కుట్రలు పన్నే స్వభావం వుంటాయంటే, మనలో చాలామంది దిగులుపడిపోతారు. కానీ—ఏం చెయ్యం; నిజం అంతే!

డాక్టర్ డబ్లియు. ఇ. పీటర్సన్ అనే అమెరికన్ శాస్త్రవేత్త 26 ఏండ్లపాటు గోవులనుగురించి విపరీతమైన శ్రద్ధతీసుకొని అనేకరకాల పరిశోధనలు చేశాడు. అన్నిఏళ్ళ అనుభవంమీదటనే ఆయన, ఆవుల్లోనూ వర్గవిభేదాలున్నవన్న విషయం బయటపెట్టాడు. ఆవులు ఒకటీ, రెండుగా కాక, కొన్ని వందలు కలిసి ఒకచోట బ్రతుకవలసి వచ్చినప్పుడు, వాటిల్లో వాటికి ఏవో హెచ్చుతగ్గులు, వాటినిబట్టి గౌరవ మర్యాదలు సంపాదించుకొంటాయి. మందలో వుండే ప్రతి ఆవుకీ తోటి సంఘీయులలో నిర్ణీతమైన స్థానం ఒకటివుంటుంది. తన కంటే పై స్థానాలలోవుండే మిగిలిన అన్ని ఆవుల పట్లా, ప్రతిఆవు గౌరవ మర్యాదలతో మసులుకొంటుంది. అల్లాగే తన కంటే తక్కువ స్థానాలలో వుండే వాటి వైపు చిన్నచూపు చూస్తుంది. మాటవరసకి అన్నీ కలిసి నీటి తొట్టి దగ్గరకు వెళ్లాయనుకోండి. ముందుగా తొట్టిదగ్గరకు చేరిన ఆవు, తనకంటే పైతరగతికి చెందిన ఆవు చొచ్చుకువస్తే, దానికి చోటు యిచ్చి, తాను తప్పుకొంటుంది. అదే, తనకంటే తక్కువ తరగతికి చెందిన ఆవు పొరపాటుగానైనా తొట్టిలోకి తొంగిచూసిందంటే మూతి పళ్లురాలేలా తన్నుతుంది. (మానవులలో యీ లక్షణం ప్రతివారి జీవితంలోనూ లెక్కకు లేనన్నిసార్లు అనుభవానికి వస్తూనే వుంటుంది.)

ప్రతిమందలోనూ గోవుల రాణీ ఒకటుంటుంది. రాణీఅనగానే, అదేదో చాలా అందమైనదనో, బలిష్ఠంగా వుంటుందనో అనుకోనక్కరలేదు. కొన్నికొన్ని గోవుల రాణీలకి సొట్టకాలుకూడా వుండవచ్చు. అందులో అబ్బురమేమిలేదు. కాలుసొట్ట అయినందువల్ల, కన్నుగుడ్డి అయినందువల్ల, దీని అధికారం వీసమంత తగ్గదు. రాణీగారు ఎల్లా వుంటేనేం,—మిగిలిన ఆవులన్నీ కిక్కురుమనకుండా దాని ఆజ్ఞలను శిరసావహించవలసిందే!

మనుష్యులలో లాగా, ఆవుల మందల్లో, రాణీకూతురు రాణీ కావటానికి వీల్లేదు. ఆస్థానంకోసం ప్రతి ఆవూ ప్రయత్నించి సాధించుకోవాలి. మందలోవుండే అన్ని ఆవులతలలతోనూ యిది ఢీకొనాలి. ఏ ఆవు అయితే తాడించిన తలను తాకిడికి తట్టుకోలేక, తీసేసుకు తోక ముడిచి పారిపోతుందో అది ఓడిపోయినట్లు గుర్తు. ఈ విధంగా రాణీ కావలసిన ఆవు, మందలోని మిగిలిన ఆవులన్నిటితోనూ పోటీ పడవలసిందే. మందలోకి క్రొత్తగా ఏదైనా యింకొక ఆవు వచ్చిచేరితే అదీ మందలోని అన్ని ఆవుల

## ★ జంతుకోటిలో మానవలక్షణాలు ★

తోను, రాణీతోను పోటీపడి, మున్ముందుగా ఆమందలో తన స్థానం ఏమిటో తేల్చుకోవాలి. కర్మవశాత్తుఅప్పటివరకు ఆమందకు రాణీగా వుంటున్న ఆవుగనుక క్రొత్తగా వచ్చిన యీ ఆవుతో పోటీపడి ఓడిపోతే, క్రొత్తగా వచ్చిన యీ ఆవే నాటి నుంచీ రాణీ అవుతుంది. ఒకసారి ఓడిపోయాక, ఓడిపోయిన ఆవు ఏదీకూడా, తనను ఓడించిన ఆవు జోలికి మళ్లా పోదు. (ఇలాంటి కట్టుబాటు మన రాజకీయనాయకులలో కూడా వుంటే ఎంత బాగుండును! చరిత్రలో కనిపించే అన్ని కుతంత్రాలు జరగక పోయేవి.)

గోవుల రాణీకి మందలో అనేక అదనపు సౌకర్యాలు, రాచరికపు మర్యాదలు క్రమం తప్పకుండా నడుస్తూ వుంటాయి. మంద అంతా కలిసి ఎక్కడికైనా మంచి పచ్చిక బీడులోకి మేతకోసం పోయినప్పుడో, ఎక్కడో ఒకచోట మంచికం లేతగడ్డి కనిపిస్తే, దానిని ముందుగా రాణీగారు తమ ముత్యాలవంటి దంతాలతో కొరుకుతారు. వారు తిని వదిలేశాకనే మిగిలిన ఆవుల్లో ఏదైనా ఆగడ్డిని అల్లా వాసన అయినా చూడకూడదు. మేతమేసి సాయంకాలం యింటికి వచ్చాక, ఇరుకు వాకిలిలోనుంచీ లోపలికి పోయేటప్పుడు, గోవుల రాణీగారు ముందుగా గడపదాటేవరకు మిగిలిన ఆవులన్నీ వారికి దారి యిచ్చి ప్రక్కకు తప్పుకు నిలబడతాయి. రాణీగారు గడపదాటాక, ఆవిడగారి తరువాత స్థానం ఎవరిదో ఆ ఆవు లోపలికి వెళ్లుతుంది. దాని తరువాతిస్థానం ఎవరిదైతే వారు, దానివెనకాల వెళ్లుతారు. ఇలాగ, ఎవరిస్థానాన్నిబట్టి వారు లోపలికి వెళ్లితే, ఆఖరికి మిగిలేది, అందరి చేతుల్లోనూ చావుదెబ్బలు తిన్న చవటలాంటి బక్కఆవులు.

క్రొత్తగా వేరొకమందలో చేరబోయేముందు, పూర్వం తానున్న మందలో రాణీగా మెలగిన ఆవు, క్రొత్తగా చేరిన మందలో రాణీతనాన్ని సంపాదించుకో లేకపోతే, వెర్రి ఎత్తినట్లు వెధవ వేషాలు చాలా వేస్తుంది, ఆవు క్రోపం పట్టలేక అడ్డమొచ్చిన వాళ్ళ నందరినీ తన్నెయ్యటం, పాలు పూర్తిగా ఎగజేపెయ్యటం యిలాంటి పనులు ఎన్నో చేస్తుంది. బలవంతాన పాలు పితకబోయిన వారిని ఒక్కొక్కప్పుడు ఆస్పత్రుల పాలుకూడా చేసేటంత భయంకరంగా తయారు అవుతుంది. రాణీతనం పోగొట్టుకొనేవరకు అతి సాధువుగా మెలగిన ఆగోవేనా యింత భయంకరంగా తయారైందనిపిస్తుంది.

(మనలోకూడా ఎవరినో ఒకరిని ఏదో ఒక కారణంచేత, చేస్తున్న ఉద్యోగంకంటె తక్కువహోదాగల వుద్యోగానికి పంపించటం జరుగుతుందనుకోండి. అల్లాంటి వారందరూ యీ మాజీ గోరాణీలాగే వుడుకుమోతుతనం అనేకవిధాల బయటికి కక్కుతుంటారు. మనలో మరికొంతమంది వుంటారు. జీవించటానికి ఏకాస్త అవకాశం దొరికినా అందుతోనే తృప్తిపడిపోయి, పైమెట్టుకు పోవటానికి ప్రయత్నమైనా చేయరు. ఈగోవులుకూడా చాలామటుకు అంతే!)

(ఇంకావుంది)

# తెరచాప కొయ్యలో దాగిన రహస్యం

శ్రీమతి అందే ఆండాళమ్మ

చిన్నప్పటినుంచీ, దెయ్యాలను గురించి, దేవతలను గురించీ కథలు చదివేవాడిని; వినేవాణ్ణి. అవి వినటానికి ఎంత బాగున్నా, వాటిల్లో ఎంతమటుకు నిజం వుంటుందో మీకందరికీ తెలుసు. భూమ్మీదనే నివసించే ప్రజలలో యీమాదిరి నమ్మకాలు వుండటం సాధారణమే అయితే కావచ్చు, కానీ సముద్రయానమే వృత్తిగా పెట్టుకున్నవారిలో సయితం ఇటువంటి మూఢనమ్మకాలు అప్పుడప్పుడూ ప్రబలంగా కనిపిస్తూ వుంటాయి. నేనూ నౌకయానంతో సంబంధించిన వృత్తిని స్వీకరించాక యీ విషయం నాకే అనుభవానికి వచ్చింది.

'డ్రఫిన్' నౌకలో 1936 జనవరి 17 న, చేరాను. మొదటి మూడు నెలలు ఇంటిధ్యాస ఎక్కువగా వుండి బెంగపెట్టుకున్నాను. ఎప్పుడూ బంధువులు, స్నేహితులనుగురించిన మధురాతిమధురమైన స్మృతులు నా మనస్సులో మెదులుతూ వుండేవి; నానుంచి నేనే వేరుపడ్డట్టు బాధపడేవాడిని. కాని కాలం గడిచినకొద్దీ ఓడమీది నావికులతో అలవాటుపడిపోయాను.

ఒకరోజు రాత్రి భోజనం అయ్యాక ఏమీతోచక ఓడ పైభాగానికి (*Deck*) వెళ్లి నిలబడ్డాను. ఎక్కడిదో వింతశబ్దమొకటి వినవచ్చింది. పరీక్షగా విన్నాను. బాగా గాయపడ్డమనిషి, హీనమైన స్వరంతో, బాధకు ఓర్వలేక ఏడుస్తున్నట్లు వినబడింది. అదైనా ఓడ తెరచాపకొయ్యవున్న వైపునుంచే వస్తోంది. ఆ స్తంభానికి దగ్గరలోనే ఆసుపత్రివున్నది: అందులో ఎవరైనా రోగి ఉన్నాడేమోనను కొన్నాను. కంగారుగా అక్కడకు వెళ్లాను. కాని అక్కడ కూడా ఎవ్వరూ లేరు. పైగా, ధ్వనిమట్టుకు, ఇంకా తెరచాప కొయ్యలోనుండే వస్తూన్నట్లు అనిపించింది.

నన్ను చెప్పలేనిభయం ఆవహించింది. ధ్వని మట్టుకు చాలా స్పష్టంగా వినబడుతోంది. దగ్గర్లో ఎవ్వరూ ఉన్నట్లు కనుపించదు. నేను చాలా భయపడిపోయి, యిక అక్కడ వుండలేక కంగారు, కంగారుగా, *Orlop Deck* (ఇందులోనే శిక్షణపొందుతున్న విద్యార్థులు పండుకుంటారు)కు వెళ్లిపోయి గట్టిగా ముసుగుతన్ని పడుకొన్నాను.

తర్వాత రెండురోజులు, పైకి వెళ్లడానికి కూడా ధైర్యం చాలలేదు. మరునటి లక్ష్మీవారంనాడు మళ్లీ పైకి వెళ్లాను. నేను భయపడ్డట్టే ఆధ్వని మళ్లీ వినిపించింది. దాంతో నేను జబ్బుపడడం, ఆసుపత్రికి వెళ్లడం సంభవించింది.

శుక్రవారంనాడు, శనివారంనాడుకూడ అదేధ్వని, అదే సమయంలో వినవచ్చింది. ఆసుపత్రిలో ఉన్నాను కనుక, నేను దానిని చాలా స్పష్టంగా వినగలిగేను. కాని ఈ వింత సంఘటనను గురించి ఎవ్వరికి చెప్పటానికి ధైర్యం చాలిందికాదు. మరునటి ఆదివారంనాడు రాత్రి భోజనానంతరం ఆదగ్గరలో నేతిరుగుతున్నాను. ఆ ధ్వని మళ్ళీ వినబడింది. కాని ఈసారి చాలా హీనంగా వుంది. ఈ శబ్దం ఏమై ఉంటుందా అని ఆలోచిస్తుండగానే, ఏదో తెరచాప కొయ్యనుండి తుపాకీ గుండులా దూసుకొని 'ఎలిఫెంటా' ద్వీపం (ఈ ద్వీపం బొంబాయికి పదిమైళ్ల దూరంలో వుంది) వైపుకు పోయి, మాయమైంది. నేను చూసిందల్లా తెరచాపకొయ్యపై చిన్న వెలుతురు: 'ఎలిఫెంటా' ద్వీపం ఆవల ఒక మెరుపు. మిగతాది చూడడా



## ★ తెఱచాపకొయ్యలో దాగిన రహస్యం ★

నికి నేను చాలా భయపడిపోయి ఉన్నాను. ఆనాడు "అది" వెళ్ళిపోయిన తరువాత మళ్లీ తెఱచాప కొయ్యలోనుంచీ ఏ విధమైన శబ్దమూ వినబడలేదు. ఆ రాత్రి నాకు పెద్దగా జ్వరము, తలకాయ నొప్పీ వచ్చాయి. ఇద్దరు స్నేహితుల్ని పిలిచి జరిగిన దంతా చెప్పాను. జ్వర పైత్యంలో నాకు అల్లా అనిపించి వుంటుందే కానీ నిజమై వుండదని వాళ్లు నా మాటలన్నీ కొట్టేశారు.

జ్వరం పూర్తిగా తగ్గిపోయాక మళ్ళీ డెక్ మీదికి వెళ్ళాను. తెఱచాప కొయ్యమీద ఒక నల్ల నిగుర్తు ఏదో కనిపించింది. తెఱచాప కొయ్య చుట్టూ ఉండే లోహపు తొడుగు అక్కడ నొక్కుపడిపోయింది. ఆ నొక్కు పడ్డ చోటనే చాలా స్పష్టంగా నల్లగుర్తు కనబడుతూంది.

కొన్ని రోజులు గడిచాక, ఒక రోజున, 'డఫ్రిన్'లోని ఒక నావికుడితో ఏదో మాట్లాడుతున్నాను. ఆ మాటల సందర్భంలో 'డఫ్రిన్' మొదటిరోజుల్లో, తనకో స్నేహితుడుండేవాడని, ఆ స్నేహితుడు చాలా విచిత్రమైన మనిషనీ, అతడు తన అధికారంలో ఓ భూతాన్ని అట్టే పెట్టుకొన్నానని తనతో చెబుతూండేవాడనీ, చెప్పాడు. తన స్నేహితుణ్ణిగురించి యింకా వివరిస్తూ, అతడు తనలో తనే మాట్లాడుకుంటూండగా చాలామంది వినేవారన్నాడు. అతను ఆ మాట్లాడుకోవటం తనలో తనే మాట్లాడుకొంటున్నాడో లేక ఎవరికీ కనిపించని దేనితోనో మాట్లాడుతున్నాడోనని అందరూ అనుకొంటూ వుండేవారట. బహుశః అదే అతని అధీనంలో వుండే భూతమై వుండవచ్చునని అనుకొనేవారటకూడాను.

ఆ స్నేహితుడు తనకో సీలు వేసిన కవరు ఇచ్చాడనీ, ఇచ్చే ముందు తను చనిపోయేక, "డఫ్రిన్"

(42-వ పేజీచూడండి)

# పందెం

మా వూళ్ళో ప్రతి బుధవారమూ సంత జరుగుతూంటుంది. మా పిన తండ్రి గారి వూరు మా వూరుకి రెండు మైళ్ళే వుండడంచేత, వారానికి ఓసారి మా వూరొచ్చేవాడు మా బాబయ్య.

చిన్నప్పటి మంచీ నాకు మా బాబయ్యంటే ఎంతో ఇష్టంగా వుండేది. ఎందుకంటే-ఆ రోజుల్లో ఒక కానీ ఇస్తే మావూరు లాంటి పల్లెటూళ్ళో, ఇప్పుడు పట్నవాసాల్లో అణాకి ఇచ్చేదానికి రెండు రెట్లు కారప్పూసపొట్లాం వచ్చేది. మా బాబయ్య వచ్చేడనగానే బడైనా మానేసి బాబయ్యా వెంట పడే వాడిని-కాని కోసం. అతనిచ్చే కానో, అర్ధణాయో పెట్టి కారప్పూస కొనుక్కు- తినడం మహా వేడుకగా వుండేది.

మా బాబయ్య ప్రతి బుధవారమూ మావూరు రాకుండా వుండేవాడు కాదు; నేను స్కూలుకి సెలవు పెట్టడం తప్పేదికాదు. (సెలవు పెట్టకపోతే కాని రాదుగా మరి!)

అప్పుడప్పుడు ముంజికాయలు, మామిడి పళ్ళ కాలాల్లో మా బాబయ్యా గారింటికి వెళ్లి, ఓవారం రోజులు తిష్ఠవేసి, మామిడి పళ్ళూ అవీ మొహం మొత్తేటట్లు తిని వస్తూండేవాణ్ణి. (అప్పటికి యింకా మా బాబయ్యకి పిల్లలు లేరు.)

ఓసారి మా బాబయ్య వచ్చి వాళ్ళ వూళ్ళో అమ్మవారి తిరుణాల జరుగుతున్నదనీ మమ్మల్నీ మా పెదనాన్న గార్నీ పిలిచివెళ్లాడు.

పిలవడమే తడవుగా నేను బయలుదేరాను. ఏమంటే అది మామిడి పళ్ళు, ముంజికాయలు వుమ్మరంగా వచ్చేరోజులు.

శ్రీ నాగేశ్వర్

తిరుణాల నాటికి మా పినతండ్రి గారింటికి వచ్చిన చుట్టాలెవరంటే- మా పెద్దనాన్న గారి పిల్లలిద్దరు ఇంచుమించుగా నాయీడు వాళ్ళే. (నాకప్పటికి పదో ఏడో, పదకొండో ఏడో!) మాఒక వేలు విడిచిన మేనత్త, మానాన్న, మాపెద్ద నాన్న పిల్లు అక్కడి ఆరోజు జనాభా!

మధ్యాహ్నం పన్నెండయ్యే సరికి అందరూ భోజనాలు చేసి తాపీగా కబుర్లు చెప్పుకుంటున్నారు. మాపిల్లలు ముగ్గురం కలిసి ఓసారి తీర్థం అంతా చుట్టబెట్టి చక్కా-వచ్చాం. (చుట్టబెట్టి రావడమంటే చూసిరావడం మటుకే. ఇంకా తీర్థపు సంభావనలు ముట్టలేదుగా ఎవ్వరికీ - అందుకనీ ఎవరిలోనూ వుత్సాహం లేదు)

రెండయ్యాక ముగ్గురం కలిసి సంభావనకి బయలుదేరాం. మొట్టమొదట బోణీ అత్తయ్యది. ముగ్గురికీ మూడుపావలా లిచ్చింది. మా నాన్న మాత్రం చిరు తిళ్ళుతిని ఆరోగ్యం పాడుచేసుకుంటానని నాకో బేడయిచ్చి, మాపెద్ద నాన్న గారి పిల్లలిద్దరికీ చెరో పావలా ఇచ్చాడు. పెద్ద నాన్న నాకు ఏకంగానే ముట్ట చెప్పాడు ఓ అర్ధ రూపాయి.

ఇంక ముగ్గురం కలిసి మా బాబయ్య దగ్గర సంభావనకి బయల్దేరాం. బాబయ్య కోసం ఇల్లంతా వెతగ్గా వెతగ్గా తనపడక గదిల్లో పడుకుని నిద్రపోతూ కనిపించాడు. మంచం దగ్గిరి కెళ్ళి అతని చెవుల్లో పుల్లలుపెట్టి కెలికీ, కిత కితలు పెట్టీ మొత్తంమీద నిద్ర లేపేశాం. నిద్రలేపిన కోపంచేతనో ఏమో, ముగ్గురికీ మూడు రూపాయలిచ్చాడు!!!

ఈవిధంగా సంభావన డబ్బులు ముట్టేటప్పటికి మూడు గంటలయ్యింది. ఇంక తరువాతి కార్యక్రమంగురించి ఆలోచించుకొంటూ వుండగా మాఅత్తయ్య మమ్మల్ని పిలిచి "డబ్బులు ఖర్చు చేసుకోకుండగా కడుపు నిండేటట్లు చేస్తాను ఒప్పుకుంటారా?" అని అడిగింది.

మాకంత కంటే కావలసిందేముంది కనక! చెప్పమన్నాము, ఏక గ్రీవంగా.

ఇంతట్లోకి పెద్దవాళ్ళు అంతా కలసి అమ్మవారికి పళ్ళిచ్చి వస్తామంటూ తీర్థంలోకి బయలుదేరారు.

అత్తయ్య మెల్లిగా మామిడి



# ★ పందెం ★

కళ్ళు కావు తియ్యమంది బాబయ్యని. 'ఎందుక' నడిగాడు బాబయ్య. 'పిళ్ళు మామిడి పళ్ళు; మామిడి పళ్ళని మహా ఉబలాట పడ్తు న్నారు. ముగ్గురినీ పందెం పేరు చెప్పి ఎన్నిపళ్ళు తినగలరో చూతా'మంది అత్తయ్య.

బాబయ్య మామిడి పళ్ళ కావున్న గదితలుపుల తాళం తీసి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

అత్తయ్య ఓ పెద్ద తట్టలోకి మంచి మంచి రసాలు బాగా మిగల ముగ్గినవి ఏరి తెచ్చింది; ఓ యాభై పళ్ళదాకా. తెచ్చి "ఈపళ్ళలో ఎవరెక్కువ తింటారో వాళ్ళకి ఓ రూపాయ బహుమతీ...ఊ! చూస్తా రేం మొదలెట్టండి!" అని హెచ్చ రించింది.

ఆవిడ మాట అనడమే తడవుగా ముగ్గురం తట్టకి మూడువేపులా పొయ్యి గడ్డల్లా కూర్చుని తినడం మొదలెట్టాము. ఎన్ని పళ్ళు తిన్నామో మాకు తెలయటం లేదు. నేను మాత్రం రెండేసి నిము షాలకి ఓపండు తింటున్నాను. తొక్కల్లో గుంజు పీల్చకుండా టెంక గుంజు మట్టుకే పీల్చే స్తున్నాను.

ఇంతట్లోకీ మా బాబయ్య రెండు తట్టల్తోటి ముంజికాయలు తెప్పించి మాముందర పోసి "ఈ పాటికి మామిడి పళ్ళ పందెం మానేసి, ముంజికాయల పందెం వెయ్యండిరా" అన్నాడు, మమ్మల్ని ఉద్దేశించి.

ముంజికాయల పందెం అనగానే నాకు కాస్త భయం వేసింది. పందెం నెగ్గలేక పోతామని. ఏమంటే ముంజికాయ తిండం చేత కాదునాకు. అయినా పౌరుషం వదులుకోలేక తల వూపాను, సరే నని.

(మా తూర్పు గోదావరి జిల్లా కోన సీమవాళ్ళంతా ముంజికాయ చుట్టూరా డిప్పలల్లాగా వుంచి పైన మాత్రం ముంజలు బయట కుడే దాకా చెక్కించి వేళ్ళతో పొడుచుకు తింటారు. అదే నాకు తిన్నగా చేతకాదు.)

పందెం ప్రారంభ మయింది. నేను ముంజికాయ మూతి దగ్గరగా పెట్టుకుని వేళ్ళతో పొడుచు కుంటూండగా ముజంలో నీళ్ళు నాకళ్ళల్లో పడి తెగ మండటం ప్రారంభించింది. నేను నాకళ్ళని సముదాయించుకునేలోగా మా వాళ్ళిద్దరూ మొదటి కాయలు కానిచ్చేసి రెండవకాయ పట్టు కున్నారు. నేనుకూడా ఆ మొదట కాయ సగం తిని, తినకుండా ఎల్లా గయినా పందెం నెగ్గాలని కాయ మీద కాయ సగం సగం వదలిపెట్టి తింటున్నాను.

మా అత్తయ్య మధ్య మధ్య కొన్ని ముదరకాయలు కూడా చెక్కించి అక్కడ పెట్టించేది. ఆ

(53-వ పేజీ చూడండి)

**బొమ్మరిల్లు సీరియల్**

# అద్దెబోటులో-
# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

సముద్ర ప్రయాణం వద్దని నేను వూరికే అనలేదు: దానికి తగినన్ని కారణాలు వున్నాయి. అధమపక్షం రెండు నెలలపాటైనా, వున్న వూరు వదిలిపెట్టిపోగలవారికి సముద్రప్రయాణంగానీ, పట్టుమని వారంరోజులైనా గడవకముందే కొంపకి తిరిగి రావలసినవారికి సముద్రయానం ఎంత మాత్రమూ లాయకీ కాదు.

ఏమంటే—మాటవరసకి మీరు సోమవారంనాడు ఓడ ఎక్కబోతున్నారనుకోండి. ఆ రోజంతా మీకు చాలా హుషారుగానే వుంటుంది. మిమ్మల్ని సాగనంపటానికి వచ్చినవారందరి దగ్గరా శెలవు తీసుకొని ఓడ ఎక్కుతారు. ఓడ బయలుదేరేటప్పటికి మీ మనస్సు మహా వుప్పొంగిపోతూ వుంటుంది. కోటు జేబులోనుంచీ మూరెడు పొడుగు చుట్ట బయటకి తీసి వెలిగించి గుప్పుగుప్పున పొగ వొదులుతూ, మహా ఠీవిగా నిలబడుతారు. ఆ క్షణాన మిమ్మల్ని మించిన గొప్ప వ్యక్తి మరొహాడీ భూమ్మీద లేడనుకొంటారు. నౌకా చరిత్రలో ప్రసిద్ధులైన కెప్టెన్ కుక్, సర్ ఫ్రాన్సిస్ డ్రేక్, క్రిస్టఫర్ కొలంబస్ లాంటివారి ఆత్మశక్తులన్నీ ఆ క్షణంలో మిమ్ముల్ని ఆవహించి కీర్తికాంత ఒడిలోకి నడిపిస్తున్నాయని నిజంగా నమ్ముతారు. మంగళవారం మధ్యాహ్నానికి మీకు వుప్పుగాలివల్ల వచ్చే వాంతులు తలత్రిప్పట ఆరంభమై, యీ దిక్కుమాలిన ఓడ ఎక్కకుండావున్నా బాగుండేదనే అభిప్రాయం, మీకు తెలియకుండానే, మీ మనస్సులో దూరి వేధించటం మొదలుపెట్టుతుంది. వరసగా బుధ, గురు, శుక్రవారాలు, మూడుర్రోజులపొడుగునా ఆ వాంతులూ అవీ అంతకంతకూ ఎక్కువై పోయి, యిలాంటి వెధవ బ్రతుకు బ్రతికేకంటే, గుండె రాయిచేసుకొని ఆ సముద్రంలో పడి చస్తేనే మేలనిపిస్తుంది. శనివారం నాటికి ఎల్లాగైతే నేం, అతిప్రయాసమీద పక్కమీదనుంచీ లేచి కూర్చొని కాస్త పథ్యం పుచ్చుకొని, మీ క్షేమ సమాచారా లడిగినవారికి తెచ్చిపెట్టుకొన్న చిరునవ్వుతో సమాధానం చెప్పగలుగుతారు. ఆదివారం నాటికి వొంట్లో కొంచెం తేలిగ్గా వున్నదనిపించి, ఏదో ఎంగిలిపడి, ఓడమీదనే నాలుగు అడుగులు వేస్తారు.

మళ్ళీ సోమవారంనాటికి మీ ఆరోగ్యమైతే పూర్తిగా మామూలు స్థితికి వస్తుంది కానీ, ఆ రోజుతో మీ శెలవు అయిపోతుంది. పెట్టే బేడా సర్దుకొని ఓడ దిగిపోతూ, మరి ఒకటి రెండు రోజులు అందులోనే గడపగలిగితే ఎంత బాగుండుననుకొంటారు. నేలమీద కాలుపెట్టేకమాత్రం, మీ సముద్రయానం మొత్తంమీద బాగానే జరిగిందనే వెర్రినమ్మకం మీలో ఒకటి ఏర్పడుతుంది.

మా మేనమామ కొడుకు ఒకడు వెనుక ఒకసారి యిల్లాగే అనారోగ్యకారణంచేత ఓడప్రయాణం


మూలం :
జెరోమ్ కె. జెరోమ్

అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

 ముచ్చటగా ముగ్గురు 

చేయవలసిరావటం, నేను బాగా ఎరుగుదును. వాష్ణు లండన్‌నుంచి లివర్‌పూల్‌కి రిటర్న్ టిక్కెట్టు కొన్నాడు. కానీ - లివర్‌పూల్‌కి చేరేలోగానే వాడికి సముద్ర ప్రయాణం మొఖం మొత్తిపోయి, తిరుగు ప్రయాణం టిక్కెట్టు ఎవరికో ఒకరికి అమ్మేద్దామని కాళ్ళ చెప్పులు అరిగిపోయేలా తిరిగాడు. లివర్‌పూల్ మహాపట్నంలో వీడు యీ టిక్కెట్టు చేతబుచ్చుకొని, ఎంత తక్కువధరకి కావాలంటే అంత తక్కువ ధరకి యిస్తానంటూ, కనిపించిన ప్రతివాడినీ బ్రతిమాలాడు. ఎవరిమటుకు వారు వద్దన్నవారే గాని, కావాలన్న వాడు ఒక్కడూ కనిపించలేదు. మావాడు నీరుగారి



పోయి బీచివొడ్డున కూలబడ్డాడు. ఇంతలో పైత్య ప్రకోపం ఎక్కువగా వున్న యువకు డెవ్వడో వీడికి తారసిల్లాడు. పరిశుభ్రమైన సముద్రపు గాలి, వ్యాయామం అవసరమని వైద్యులు ఆ యువకుడికి సలహా యిచ్చారట. అందుకనే అతడు ఆ చాయల తిరుగుతున్నాడు. అతడిని ఎల్లాగో మాటల్లోకి దించి, ఒప్పించి, మావాడు, తన టిక్కెట్టు వాడికి 18 షిల్లింగులకే అమ్మజూపాడట. టిక్కెట్టు వాడి చేతిలో పెట్టుతూ, వాడి మంచికోరే చెప్పబోతున్నట్లుగా నమ్మకమైన నవ్వు మొఖంమీద కనిపించేలా ముందుగా జాగ్రత్తపడి, "చూడండి! సముద్రప్రయాణం చేసినందు వల్ల ఎన్ని రకాలుగా మీకు కలిసివస్తున్నదో గమనించారా? మీకు సముద్రపు గాలి, వ్యాయామమూ కావాలనికదా వైద్యులు చెప్పారు? ఇంత చవకగా వచ్చిన యీ టిక్కెట్టుతో మీరు యిక్కడినుంచీ లండన్‌కి చేరేలోపల, నేటినుంచీ జీవితాంతంవరకు సరిపోయేటంత సముద్రపు గాలి పీల్చుకొని పదిలంచేసుకోవచ్చు. ఇకపోతే వ్యాయామం! ఆ మాటకొస్తే— ఓడలో ప్రయాణం చేయటమే పెద్ద వ్యాయామం. ఒడ్డుమీదచేరి గాలిలో పిల్లిమంత్రాలుకొట్టటం ఎంతో, ఓడ ప్రయాణంలో ఆ కుదుపుకి తట్టుకోవటమూ అంతే!" అంటూ వాడా టిక్కెట్టు తిరిగి యిచ్చెయ్యకుండా చూసుకొన్నాడు.

ఆ కాస్త పనీ పూర్తి అయ్యాక—బ్రతుకు జీవుడా అని మా బావ రైల్లో పడి యింటికి తిరిగొచ్చాడు. ఆ రోజునుంచీ యీరోజువరకు తన తత్వానికి రైలు పడినంత యిదిగా, మరేదీ పడదు పొమ్మంటుంటాడు.

నే నెరిగిన పెద్దమనిషి యింకొకడు కూడా యిల్లాగే వారం రోజులపాటు ఓడప్రయాణం చేసివద్దామని బయలుదేరి వెళ్ళాడు. ఓడ బయలుదేరే సమయానికి ఎవడో, అందులో పనిచేసే మనిషి ఒకడు, యీయన వద్దకు వచ్చి, ఆ వారం రోజుల్లోనూ 'ఎప్పటి కప్పుడే భోజనాదులకు డబ్బు చెల్లిస్తారా, లేక ఏకమొత్తంగా ముందే చెల్లిస్తారా?' అని అడిగాడు. ముందుగా చెల్లిస్తే తేలికలోనే తేలిపోతుందని కూడా చెప్పాడుట.

మా స్నేహితుడు కొంచెం తిండిపుష్టిగలమనిషి. అంచేత ఏకమొత్తంగా ముందే చెల్లించేస్తే, చెల్లించిన డబ్బుకి నాలుగురెట్లు గిట్టుబాటు అయ్యేలా చూసుకోవచ్చునని ఆశపడ్డాడు. ఏకమొత్తంగా యిర్వై ఐదున్నర పౌనులు చెల్లించేశాడు. ఇక అక్కడనుంచీ ఆరంభమయింది అసలు కొలువు. ఆ ఒక్క పూట ఏం

తిన్నాడో, అదే దక్కుడు. ఆ మరునటి క్షణంనుంచే పడలేదు. ఆరో రోజుకి వాళ్లు కొంచెం నయమైంది. వాంతులు లంకించుకొన్నాయి. ఆతరువాత వరుసగా ఆ రోజుమాత్రం ఏదో కాస్త తినగలిగాడు. ఏడో ఐదురోజులుపాటు పచ్చి మంచినీళ్ళు అయినా మింగుడు నాటికి ఆయన ప్రయాణమే ఆఖరైపోయింది. ఒడ్డు

# ★ ముచ్చటగా ముగ్గురు ★

మీాదికి దిగాక, కదిలిపోతున్న ఓడకేసి చూస్తూ, తిండి కోసం తను చెల్లించిన డబ్బు విలువలో పాతికవంతైనా దక్కకుండా పోయినందుకు చాలాసేపు నిట్టూర్చాడు.



ఇంతమంది అనుభవాలు యీరీతిగా వున్నాయి కనుకనే నేను సముద్రప్రయాణం వద్దన్నాను. అదైనా, నాకేదో రోగం వచ్చేస్తుందని, కష్టపడి పోతానని నాగురించి నేను భయపడికాదు. కేవలమూ జార్జి లాంటి జబ్బుమనిషికి యీ ప్రయాణం చెరుపు చేస్తుందేమో ననేదే నాకు పట్టుకున్న భయమని బయట పెట్టాను. జార్జి వెంటనే అందుకొని, తనకేమీ ఫరవాలేకపోగా, ఓడమీాద ప్రయాణం చెయ్యటం తన మనస్సుకీ శరీరానికీ కూడా చాలా మంచి చేస్తుందంటూ నా అభిప్రాయాన్ని ఖండించాడు. అంతే కాదు—యీ ప్రయాణం సరిపడకపోవటంఅంటూ ఎవరికైనా జరిగితే అది నాకూ, హారిస్సుకే నన్నాడు. మా యిద్దరినీ నోరు మూసుకోమన్నాడు.

వెంటనే హారిస్సు కల్పించుకొని, కాస్తంత సముద్రంమీాద ప్రయాణం చేసినవారంతా యీ వాంతులు అవీ ఎలా తెచ్చుకోగలుగుతారో తనకి ఏనాటికీ అర్థంకాదన్నాడు. బహుశః అల్లావాంతులు తెచ్చుకోవటం, ఒక ఫాషన్ అయివుంటుందనీ, అందువల్లనే ప్రతివారూ అలా నటిస్తుంటారు కానీ అందులో నిజమేమీా లేదు పొమ్మన్నాడు. తనకీ ఎన్నోసార్లు అనిపిస్తుంటుందట—ఎప్పటికైనాసరే ఓడప్రయాణం చేసే వారికి నిజంగా వాంతులు రానవసరంలేదని ప్రపంచానికి చాటి పారేద్దామని! ఆ వుద్దేశంతోనే తాను యిదివరకు ఎన్నోసార్లు ప్రయాణంచేసి చూశానని అంటూ, తన అనుభవాలు కొన్ని ఏకరువు పెట్టాడు.

ఇదివరకు ఒకసారి తాను, ఇంగ్లీషు చానెల్లో మహాభయంకరమైన తుపానుగాలులు చెలరేగివున్న సమయంలోఓడ ప్రయాణంచేశాడట. ఆ గాలికికొట్టుకు పోకుండా ఓడలోని ప్రయాణీకులందరినీ బెల్టులు వేసి కట్టిపడేశారట. తానొక్కడు మాత్రం అలాటి వాటికేమీా జంకకుండా, ఓడ అంతటా యిష్టమొచ్చినట్లు తిరిగేస్తున్నాడట. అంతలో ఓడలోని ప్రతి ఒక్కరికీ వాంతులు పట్టుకొన్నాయట. ఏ క్షణాన అయినా, తానూ, ఆ ఓడ కెప్టెన్ తప్ప మిగిలినవాళ్ళంతా మూలుగుతునే వుండేవారట. ఒక్కొక్కసారి ఆ ఓడ కెప్టెన్ కూడా మూలిగేవాడట; కానీ తాను మాత్రం ఏమీా చెక్కుచెదరకుండానే వున్నాడట.

అదేమి విచిత్రమో కానీ నేలమీాద వున్నంత కాలమూ, ఎవ్వరికీ సముద్రయానంలో వచ్చే జబ్బులు రావు; ఎందుచేతనో? అదే ఓడల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు, యీ జబ్బుతో బాధపడుతూన్న మనుష్యులు వందలకొద్దీ అవుపిస్తారు. నేలమీాద వున్నంతసేపూ అసలు ఆ జబ్బు ఎల్లా వుంటుందోకూడా తెలియనట్లే అందరూ కనిపిస్తారు. అదే, నావలోకి పోయి చూస్తే, నిత్యమూ వాటిలోనే పనిచేసే సిబ్బందికూడా యీ జబ్బుతో అవస్థపడుతూ వుండటం మనకి కనిపిస్తుంది. ఒడ్డు తగిలేదాకా ఓడలో ఎక్కడ చూసినా కనిపించే యీ రోగిష్టి మనుష్యులు, ఒడ్డుమీాదికి వచ్చే

సరికి అంతా ఏమైపోతారో ఏమో, నేలమీద యీ మాదిరి జబ్బుతో అవస్థపడేవాడు ఒక్కడూ కనిపించడు.

ఈ కనిపించకపోవటం ఎల్లా జరుగుతోందా అని నాకు ఆశ్చర్యంగా వుంటుంది. ఇదివరకు ఒకసారి యార్‌మత్ బోటులో చిత్రమైన సంఘటన ఒకటి జరిగింది. ఆ బోటులో నేనూ ప్రయాణం చేస్తున్నాను. మా బోటు అప్పటికి సౌతెండ్ పయర్ దాటివుంటుంది. నేనెందుకో అటు చూద్దునుగదా, బోటుకి వుండే పెద్ద రంధ్రంలోంచి ఒక నావికుడు సగం బయటకి వేళ్ళాడపడి వుండటం నా కంటపడింది. ఏకాస్త కుదుపు వచ్చినా అంతమనిషీ నీటిలో పడిపోయేటట్లున్నాడు. గబగబా అతని దగ్గరకు పరుగెత్తి, "ఇవతలకి రావయ్యా! బోటువూపుకి నీళ్ళల్లోపడి చచ్చిపోగలవు!" అని అతని కాలుపట్టుకు యివతలకు లాగబోయాను.

"ఈ నీళ్ళలో పడి చచ్చినా బాగుండును బాబూ!" అంటూ వాడు ఆపకుండా మూలుగుతునే వున్నాడు.

అంత కష్టం వాడి కేమిటి వచ్చిందో అని అక్కడే చాలాసేపు నిలబడ్డాను. ఎంతసేపు నిలబడ్డా వాడు ఆ మూలగటం తప్ప, ఒక్క మాటైనా మాట్లాడనూ లేదు; ఆ రంధ్రంలోనుంచి యివతలికి జారిపడనూ లేదు. చేసేదేమీ లేక నా దారిని నేను వెళ్ళిపోయాను.

ఆ సంఘటన జరిగాక, మూడు వారాల అనంతరం ఆ మనిషే నా కొక హోటల్లో కనిపించాడు. తన చుట్టూ కూర్చొనివున్న ఆ నలుగురైదుగురికీ వాడు, తన నావికానుభవాలను గురించి ఘనంగా చెప్పుకుపోతున్నాడు.

"నావికుడుగా గడపిన యిన్ని ఏళ్ళ నా జీవితంలోనూ, ఒక్కటే ఒక్కసారే, అదేమిటో తేల్చి చెప్పలేని అనుభూతి ఏదో నా మనస్సులో కలిగింది. మా ఓడ కేప్‌హారన్ సమీపిస్తుండగా యీ సంఘటన జరిగింది. ఆ మరునటి రోజే మా ఓడ బండరాయికి కొట్టుకొని బద్దలైంది" అంటూ యింకా ఏమిటేమిటో చెప్పుకుపోతున్నాడు.

నాకు మనస్సు వుండబట్టలేదు!

"ఇటు చూడండి! ఇటీవల మీరు ఒకరోజున సౌతెండ్ పయర్‌వద్ద ఓడలోంచి దూకి చచ్చిపోతే బాగుండునని అనుకొన్నారా, లేదా?" అని అడిగేశాను.

"నేనా? సౌతెండ్ పయిర్ దగ్గరనా?" అని అతి ఆశ్చర్యంగా అడిగాడు.

"అవునండీ; తమరే! ఇంకా గుర్తులు కావాలంటే చెప్తాను........క్రిందటి శుక్రవారానికి సరిగ్గా మూడు వారాల క్రితం: యార్‌మౌత్ నుంచి బయలుదేరిన ఓడలో!"

"ఓ......అవునౌను! ఇప్పుడు గుర్తు వస్తున్నది. ఆరోజు మధ్యాహ్నం ఏమైందంటే—వూరగాయ తెలియదూ?...వూరగాయ!...అది వేసుకు భోంచేశాను. దాంతో వెర్రి తలకాయ నొప్పి వచ్చేసింది. అదేలెండి, అసలు కారణం!" అన్నాడు ఆ నావికుడు.

ఓడలో ప్రయాణం చేస్తున్నప్పుడు వాంతులూ, అవీ రాకుండా చేసుకోవటానికి, నేను ఒక మంచి పద్ధతి కనిపెట్టాను. ముందుగా ఓడలో సరిగా నట్టనడి భాగమేదో చూసి, అక్కడ నిలబడివుండేవాణ్ణి. ఓడ ఎటువైపు వొంగినా, దాంతోపాటు నేనూ యింకోవైపు వొంగి, ఎల్లప్పుడూ నిటారుగానే వుండేలా చూసుకొనేవాణ్ణి. అది ఎల్లాగంటే—ఓడ ముందుభాగం పైకి లేస్తున్నదనుకోండి. నేనూ ముందుకి వొంగి వొంగి, ఓడ అడుగుభాగం వచ్చి నా ముక్కుకి తగిలేదాకా వొంగేవాణ్ణి. ఓడ వెనుకభాగం పైకి లేస్తున్నదనుకోండి: అప్పుడూ అల్లాగే అంతకంతకు వెనక్కి వొంగేవాణ్ణి. ఇలా ఎవరైనా చేయవచ్చు. ఒకటి రెండు గంటలైతే యిల్లా ఏదో అవస్థపడవచ్చు కానీ, వారం రోజులపాటు యీ పనే చేస్తూ వుండటం ఎవడి తరం?

"పోనీ—నదిలో ప్రయాణంచేద్దాం!" అన్నాడు జార్జి, వున్నట్లుండి. నదిమీద గనుక ప్రయాణంచేసేట్లయితే ఆ చల్లని గాలీ, ఆ సుందరమయ ప్రకృతీ, ఆ గంభీరమైన ప్రశాంతత మన మెదడుకి (ఆ హారిస్సుగాడికి అసలు మెదడనేది ఏమైనా వుంటే, దానికి కూడా) ఎనలేని హాయి నిస్తుందని జార్జి అన్నాడు. పడవ నడపటంలో పడ్డ శ్రమమూలంగా దేహానికి తగినంత పరిశ్రమ ఏర్పడుతుందనీ, ఆ కారణంచేత కరకరా ఆకలివేసి, కమ్మని నిద్ర పట్టి మా అందరి ఆరోగ్యాలూ బాగుపడతాయనీ తీర్మానించాడు.

నిద్ర వూసువచ్చేసరికి, హారిస్సు కల్పించుకొని,

# ★ ముచ్చటగా ముగ్గురు ★

"మన జార్జిగాడికి యిప్పటికే నిద్రమత్తు ఎక్కువగా వున్నందువల్ల, యింకా ఎక్కువ నిద్ర వచ్చేపని వాడు ఏది చేసినా కూడా, వాడి ప్రాణానికే ముప్పు రావచ్చు"నని ఒక హెచ్చరిక విసిరేశాడు. "రోజుకి గంటలు యిరవైనాలుగు కంటే ఎక్కువ అయ్యే అవకాశం కనిపించనప్పుడు, యీ జార్జి యింకా ఎక్కువ నిద్ర ఎలా పోగలడు చెప్మా" అంటూ విస్తుపోయాడు. అథవా వీడు యిప్పటికంటే ఎక్కువగా నిద్ర పోవడమంటూ జరిగితే, అది ఏకంగా పెద్ద నిద్రే ఔతుందనీ, తన్మూలంగా భూమిమీద భారం కొంతమటుకు తగ్గుతుంది అనీ తృప్తిపడ్డాడు.

నదిమీద ప్రయాణం మజాగా వుంటుందని హారిస్ అన్నాడు. జార్జి, నేనూ కూడా వాడితో ఏకీభవించాం.

మాలో యీ ఆలోచన నచ్చనిది ఒక్క 'మాంట్ మొరెన్సీ'కి మాత్రమే. అసలు మా మాంట్ మొరన్సీకి యిలాటి వేవీ పట్టవు. మాంట్ మొరన్సీ మనిషి అయితేగా! అది మా కుక్కకి మేం పెట్టుకొన్న ముద్దుపేరు. కావటానికి కుక్కే అయినా, అది మాలో ఒకటిగా మసులుతూ వుంటుంది. అందుకనే, యీ బోటుషికారు గూర్చి దాని అభిప్రాయం ఎల్లా వుంటుందో నని దాని మొఖంకేసి పరీక్షగా చూశాను. చూడగా చూడగా, ఆ కుక్కకి యీ ఆలోచన ఎంతమాత్రమూ నచ్చనట్లే తేటతెల్లమైంది.

మా నలుగురిలో ఒకరికి యిష్టం లేకపోయినా, మిగతా ముగ్గురికి యిష్టమైంది కాబట్టి, మొదట అనుకొన్నట్లుగా సముద్రయానం వదిలేసి, నదిమీదనే బోటు షికారుకు వెళ్లామని తీర్మానించుకొన్నాము.

(ఇంకా వుంది)

# ★ తెఱచాపకొయ్యలో దాగిన రహస్యం ★

(34-వ పేజీ తరువాయి)

తెఱచాపకొయ్యకు (*Main **Mast***) ఏదో అసాధారణమైన దేదో జరుగుతుందనీ, ఆ తర్వాతనే ఆ కవరువిప్పి చూసి అందులో సూచించినట్లు చెయ్యమనీ ఆదేశించాడట.

ఇది విన్నతర్వాత అప్రయత్నంగా పెద్ద నిట్టూర్పు విడిచాను. జరిగినదంతా నామిత్రుడికి వివరించి చెప్పాను. అతడు చాలా ఆశ్చర్యపడి, వెంటనే ఆకవరువిప్పి చదువుతానని వాగ్దానం చేశాడు.

ఆ మరునాడు అతడు చాలా ఆందోళనపడ్డ మనిషిలా ఉండటం గమనించేను. కారణం అడిగిన మీదట, అతడు ఆ ఉత్తరం నా చేతికి ఇచ్చేడు. అందులో ఇలా వ్రాసి ఉంది.

"నా అధీనంలో ఓభూతం ఉండేది. దానిని నేను తెఱచాపకొయ్యలో బంధించి ఉంచేను. నామరణానంతరం ఓసంఘటన మూలంగా అది బయటకు వెళ్లిపోతుంది. నాశరీరం "ఎలిఫెంటాద్వీపం"లో పాతిపెట్టబడుతుంది. ఆ భూతం అక్కడకువచ్చి, నాసమాధిలో దూరి నన్ను బాధపెట్టుతుందని నాకు భయంగావుంది. కనుక నా ఆప్తమిత్రుడవైన నీవు దయవుంచి, అద్వీపానికి నామరణానంతరం వచ్చి, దీనిలాగే వుండే మరొక వుత్తరంలో వివరించిన విధంగా చేసి, నాబాధను తప్పించమని నిన్ను అతి దీనంగా వేడుకొంటున్నాను. నువ్వు కనుక కనికరించకపోతే వందలాది సంవత్సరాలు నా కాబాధ తప్పదు."

'మిగతా పేజీలేవని' నేనడిగితే, అతను నాకది చూపడానికి నిరాకరించి, వాటితో నాకేమీ సంబంధం లేదన్నాడు.

"పోనీ, ఆద్వీపానికి వెళ్తావా?" అని అడిగాను.

"వెళ్లుతున్నా"నని సమాధానం చెప్పాడు.

ఆఖరుకు జూన్ 2 వ తారీఖున ఇద్దరం కలసే అక్కడకు వెళ్లాలని నిశ్చయించుకొన్నాము. ఆ తారీఖునే మా వేసంగి సెలవలు ఆరంభమౌతాయి.

ఎల్లాగైతే నేం—ఆ రోజు రానే వచ్చింది. "అపోలో బందర్" నుంచి ఓ చిన్న నావ అద్దెకు తీసుకొని, బయలుదేరి సాయంత్రం 4 గం॥కు ఆ ద్వీపానికి చేరాము. ఆ నావికుడు నన్ను, ద్వీపానికి తూర్పుదిశగా ఉన్న ఒకచోటికితీసుకుపోయాడు. అక్కడ చిందరవంద



మేక
చిత్రకారుడు :—శ్రీ బి. లక్ష్మణ్‌రావు (సికింద్రాబాదు)

రగా వున్న ఒక సమాధి కనిపించింది. అదే తన స్నేహితుని సమాధి అని అతడు అన్నాడు. ఆ సమాధిలోనుంచి బాధాకరమైన కేక ఒకటి మాకు వినిపించింది. ఆక్షణంలో కలిగిన భయంతో నా బొందిలో ప్రాణంకాస్తా ఎగిరిపోవలసిందే - కొంచెంసేపట్లోనే తేరుకొన్నాను!

ఇంతలో అక్కడ పెద్ద వెలుతురుతో కూడిన మెఱుపు, ఒకటి కనిపించింది. దాని వెనకాలే అతి భయంకరమైన గర్జన వినబడింది. ఆనావికుడు, తనతోపాటు రమ్మని సైగచేశాడు. ఆసమాధికి యింకా దగ్గిరిగా ఏదో అస్పష్టంగా మాట్లాడుతూ, వెళ్లాడు. మరల ఆ బాధాకరమైన మూలుగు, చాలా హీనంగా వినబడింది. ఆ నావికుడు ఏవో కొన్ని మాటలు వుచ్చరించి, తన జేబులోనుంచి ఏదో తీసి, ఆసమాధి మీదుగా ఒకరాయి దగ్గఱకు విసిరేశాడు. వెంటనే ఓ పెద్ద వెలుతురు, ఓ భయంకరమైన గర్జన వినబడినాయి. నాకు భూమిలోపలికి దించుకుపోతున్నట్లు అనిపించింది. అంతట్లో, అక్కడ ఏర్పడిన పొగ విడిపోయింది. ఆ నావికుడు, ఓ చిన్న రాయిని తీసికొని, ఆసమాధి ముందు నిలబడి ఏవో చదివి, వెనుకకు మఱలేడు.

మేము సాహలోకి ఎక్కి "అపోలో బందర్" చేరేసరికి రాత్రి 8 గం॥లయింది. అక్కడినుండి, 'పైధోని' (*Pydhoni*) లోని నాస్నేహితుని ఇంటికి వెళ్లిపోయాను.

నాటినుంచి నేటివరకు ఆ సంఘటన నాకు బాగా జ్ఞాపకం వస్తూనే వున్నది. మఱల ఎప్పుడైనా, "గ్రిఫిన్"లో డెక్ మీదికి వెళ్లితే, ఆ నల్లని మచ్చను మట్టుకు జాగ్రత్తగా చూస్తూనే ఉంటాను.

భూతాన్ని వశం చేసుకొన్న ఆ నావికుడి శరీరము, ఆ ద్వీపం మీద ఎలా పాతిపెట్టబడిందో ఇప్పటికీ రహస్యంగానే నిలచిపోయింది. ఈ విషయమై తెలుసుకోవటానికి ఇప్పటివరకూ ఏ విధమైన ఆధారమూ కనబడలేదు.

ఒకవిధంగా ఈ కథ అంతా కూడా ఒక రహస్యమే; నేను ఏవిధంగా ఇది రాయగలిగిందీ నాకే తెలియటంలేదు. "గ్రిఫిన్" ఓడ ఉంది. ఆ సమాధికూడా ఉంది. కూడా ఆ నల్లని మచ్చ వున్నది. కాని ఈ కథలోని నిజం మట్టుకు, పై మూడువిషయాల హద్దుల్లోనే దాగి వుంది.

—(*The Indian Cadet* లో *Ansaf Ahmed* రచించిన "*Mystery of the Main Mast*" ఆధారంగా.) ★

ఒకరోజు ఆక్లబ్బులో పేకాట జోరుగా సాగిపోతున్నది. ఆట చాలా రక్తికట్టి అందరికీ పట్టుదలలు పెరిగివున్న సమయంలో వాళ్లల్లో ఒక్కడు అకస్మాత్తుగా గుండెఆగి అక్కడే పడి చచ్చిపోయాడు.

మిగిలిన వాళ్లందరూ గాభరా పడ్డారు. "ఇప్పుడు ఏమిటి చెయ్యటం?" అని అడిగాడు ఒకడు.

"చచ్చిపోయిన మన మిత్రుడి గౌరవార్థం కాస్సేపు నిలబడే చీట్లాడుదాం!" అన్నాడు మరొకడు.

# క్లోజప్‌లో ఇంద్ర ధనుస్సు

చెకోస్లోవాకియన్ రచయిత కారల్ చాపెక్ రచనకు అనుసరణ:

(నండూరి రామమోహనరావు)

### మూడు నమూనా కథలు

మీరు సినిమాల్లో ఇదివరకే చూసి వుంటారు—అద్భుతశక్తులు కలిగిన మణికోసమో, పాతాళదేవత కోసమో ఎవడో రాజకుమారుడు బయలుదేరి, ముళ్లూ కొండలూ తిరిగి, మూడు చెరువుల నీళ్లుతాగి ఆఖరికి తను కోరినదాన్ని సంపాదిస్తాడు. అలాగే సినిమా కథకోసం కూడా ప్రొడ్యూసర్లు నానా అవస్థలూ పడతారు. వీరి అవస్థలనే కథావస్తువుగా తీసుకుని సినిమా తియ్యాలంటే కథ ఈ విధంగా ఉండాలి. (పరా:—అన్ని హక్కులూ, ముఖ్యంగా ఫిలిం హక్కులు రచయితవి.)

1. భగ్నప్రేమ:— ఒక పల్లెటూళ్ళో పెంకుటిల్లు. నవలా రచయిత శర్మగారు కొడుకు నెత్తుకొని జోలపాట పాడుతూ వాణ్ణి నిద్రబుచ్చటానికి ప్రయత్నిస్తూంటాడు. ఈ ప్రశాంతతను భంగం చేస్తూ తలుపు తట్టిన చప్పుడు వినిపిస్తుంది.

'ఎవరు?' అంటాడు శర్మగారు.

'పోస్టు సార్!'

'లోపలికి రా.'

పోస్టుమనిషి లోపలికి వస్తాడు. 'శర్మగారూ! తమరికి ఉత్తరం వచ్చిందండి.'

శర్మగారు చిద్విలాసంగా మందహాసం చేస్తూ (క్లోజప్) కవరు తీసుకుని చింపి చూస్తాడు. ఉత్తరం క్లోజప్‌లో కనిపిస్తుంది.

'మీరు రాసిన 'భగ్నప్రేమ' నవల తాలూకు సినిమా హక్కులు రెండువేల రూపాయలకు మాకిప్పించవలసిందిగా ప్రార్థిస్తున్నాము. మీరు తిరుగు టపాలో జవాబు వ్రాయండి. మేనేజరు, అల ఫిలిమ్స్.'

శర్మగారు ఉత్తరం చదువుకుని సంతోషం పట్టలేక కూలబడిపోతాడు. ఇంటి బయట చెట్లమీద కోకిలలు పంచమశ్రుతిలో ఆనందగీతికలు పాడుతున్న ధ్వనులు; వసంత ఋతుశోభ. తరవాత శర్మగారు లేచి అప్పటికప్పుడే సమాధానం రాస్తాడు.

'మీ రడిగినది నిరభ్యంతరంగా అంగీకరిస్తున్నాను.'

పోస్టుమనిషి వెళ్లిపోతాడు. శర్మగారు ఉయ్యాలవద్దకు వెళ్ళి నిద్రపోతున్న కొడుకును చూస్తూ అంటాడు: 'చిట్టినాన్నా!

ఫిల్మిస్థాన్ వారి "అనార్కలీ" హిందీచిత్రంలో బీనారాయ్.





సొసైటీ వారి "ప్రపంచం" తెలుగు చిత్రంలో జి. వరలక్ష్మి.

మనకి మంచిరోజులు వచ్చాయి. ఆరేళ్ళయింది 'భగ్న ప్రేమ' రాసి. గుండె చీల్చివేసి నెత్తురుతో రాశాను. ఒక్కడు చదివిన పాపాన పోలేదు. ఒక్క కాపీ అయినా అమ్ముడు కాలేదు. ఇన్నాళ్ళకి దేవుడి దయవల్ల మన గొప్పదనం లోకానికి వెల్లడయింది. అహో! సినిమా ఎంత గొప్పది! సినిమాయే లేకపోతే ఈ ఇరవయ్యో శతాబ్దం వన్నెలలేని రాత్రియే గదా! [illegible]! ఇక నీకు కావలసినన్ని సొమ్ములు కొని పెడతాను. అమ్మకు మంచిమంచి జరీ చీరలు కొంటాను.'

మళ్ళీ తలుపు తట్టిన చప్పుడు. ఇంట్లోకి ఇద్దరు కొత్తవ్యక్తులు ప్రవేశిస్తారు. ఒకరు 'సినిమా కంపెనీకి చుట్టూ మనుషుల' జాతికి చెందినవారు. ఈయన్ని 'సినిమా మానిసి' అని పిలుద్దాం. సినిమా మానిసి ముందుకు వచ్చి శర్మగారికి రెండో వ్యక్తిని పరిచయం చేస్తాడు:

'వీరు అజిత్ ఫిలిమ్సు ప్రొడ్యూసరు. మీ నవల సినిమా హక్కులకు అగ్రిమెంటు రాసుకోడానికి వచ్చారు. కాని మీ 'భగ్న ప్రేమ' ఎంత గొప్ప నవలండీ! ఇరవయ్యేళ్ళ నించీ నేను ఈ పరిశ్రమలో తిరుగుతున్నాను. ఇంత గొప్ప కథ ఎక్కడా చూడలేదనుకోండి! ఆహాహా! ఆ గుర్రాలూ, ఆ పందాలూ, అవీ చూసేటప్పటికి జనం హోరెత్తి పోతారండీ!'

శర్మగారు తెల్లబోతారు. 'గుర్రాలేమిటి?' అని అడుగుతారు.

'మీ కథలో గుర్రపు పందాలు లేవుటండీ? నాయకుడు గుర్రపు పందాల్లో ఓడిపోగానే నాయిక అతన్ని నిరాకరిస్తుంది. అతని ప్రేమ భగ్నమవుతుంది. అంతేకదూ కథ?'

'హాహా! ఎవరు చెప్పారండీ మీకూ? నా కథలో గుర్రాలూ లేవు, గాడిదలూ లేవు. గాఢంగా ప్రేమించుకున్న ఒక యువతి, యువకుడు విధివశంగా సంఘానికి బలి ఎలాపోతారో రాశాను. అంతేగాని —'

ప్రొడ్యూసరు 'ఏం బాబూ, నువ్వేం కోత చెప్పావ్?' అన్నట్టు సినిమా మానిసి కేసి చూస్తాడు.

'అయితే మీ కథలో గుర్రప్పందాలు లేవన్నమాట. నేను ఉన్నాయనుకున్నాను లెండి. ఇప్పుడైనా మించిపోయిందేమీ లేదు. మా స్క్రిప్టు రచయితకి అప్పగించామంటే గుర్రప్పందాలేమిటి, ఏం కావలిస్తే అది కథలోకి ఇరికించి పెడతాడు. అదంతా మా కొదలెయ్యండి, మేం చూసుకుంటాం. కథానాయకుడు ఒక పచ్చ గుర్రంమీద పందెం కాసినట్టు రాయమని చెబుతాను.'

'నా కథానాయకుడి దగ్గర అంత డబ్బు లేదే; చాలా బీదవాడు,' అంటారు శర్మగారు.

'మీ కెందుకు మీరూరుకోండి. మేము అతన్ని ధనవంతుణ్ణి చేస్తాంగా. కథానాయకుడి దగ్గర డబ్బు లేకపోతే ఎల్లాగండీ? మనం మరి అంత పేదవాడిగా ఉంచకూడదు. హీరో బీదవాడైతే ప్రజలు ఆ సినిమా చూస్తారా? అంచేత కథానాయకుడు ధనవంతుడే అయివుండాలి. ఈ ఒక్క విషయంలో తప్ప మీ కథ ఇంకెక్కడా మార్చనక్కర్లేదు."

# సినిమా ఎల్లా తీస్తారు?



*Dissolve to*

సినేరియో రచయిత ట్రీట్‌మెంటు రాస్తూ వుంటాడు. శర్మగారు పక్కనే కూచ్చునివుంటాడు. సినేరిస్టు శర్మగారితో: "చాలా మంచి కథండి. అయితే ఎక్కడా నౌకలే కనిపించవేమండీ?"

"నౌక లేమిటీ?" అని శర్మగారు కంగారుగా అడుగుతాడు.

"మీ నవల పేరు 'భగ్న నౌక' కాదూ?"

"కాదు, 'భగ్న ప్రేమ'" అని శర్మగారు తన నవల పేరు 'భగ్న నౌక' కానందుకు క్షమాపణ కోరుతున్నట్టు అంటాడు.

"అరె. గమ్మత్తుగా వుందే? నే నింతవరకూ 'భగ్న నౌక' అనుకునే ట్రీట్‌మెంటు రాస్తున్నాను. చంపేశారు...పోనీలెండి. 'భగ్న ప్రేమ' అనే వుంచుదాం.

*Dissolve to*

ప్రొడ్యూసరు సినేరియో చేతులో పట్టుకుని పేజీలు తిరిగేస్తూ వుంటాడు. పక్కన శర్మగారు ఉంటాడు.

"చూశారా, శర్మగారూ! మా సినేరిస్టు కథంతా చెడగొట్టాడు. ఎక్కడా ఒక్క చోటన్నా లవ్ సీను పెట్టలేదు. ఇది పనికి రాదని నేనే కొన్ని సీన్లు చేర్చవలసి వచ్చింది. కథానాయిక విలన్‌తో లేచి పోతుంది..."

"విలన్ ఎవరూ? నాకథలో విలన్ లేడే."

"లేకపోతే ఎల్లాగండీ? విలన్ పాత్ర నేనే చేర్చాను. కథానాయిక విలన్‌తో కలిసి బాల్‌రూమ్ డాన్స్ చేస్తుంది...... 'నగ్న ప్రేమ' అనే పేరుకి సరిపోయినట్టుండాలి మనకథ. ఏమంటారు?"

"నగ్న ప్రేమకాదు, 'భగ్న ప్రేమ'" అని శర్మగారు సవరిస్తాడు.

ప్రొడ్యూసరు తెల్లబోయి సినేరియో అట్టమీద చూస్తాడు.

"ఓహో, భగ్న ప్రేమా? నగ్న ప్రేమ అనుకున్నాను సుమండీ! సర్లెండి, మీరు పెట్టిన పేరే ఉంచుదాము. అదే బావుంటుంది."



"ప్రపంచం" చిత్ర నిర్మాత మిస్టర్ మూనాస్.

*Dissolve to*

చక్కగా అలంకరించబడిన విశాలమైన ఇల్లు. శర్మగారు పడక కుర్చీలో పడుకుని వుంటాడు. ఒళ్ళో కొడుకు కూర్చుని వుంటాడు. "చూశావా బాబూ! మొన్నటి వరకూ ఊరూ పేరూ లేకుండా మూరుమూల వున్న మీ నాన్నకి హఠాత్తుగా ఎంత పేరు వచ్చిందో? ఈనాటికి కదా నా కళా సేవ ఫలించింది!" ఆయన ముఖంమీద సంతృప్తితో కూడిన చిరునవ్వు తొంగిచూస్తుంది.

* * *

**2.** ఉజ్జయినీసుందరి:—స్థలం మద్రాసు మహానగరం. ఒక చిన్న అందమైన బంగళాలో ప్రఖ్యాత సినిమా రచయిత వీరేశ్వర రావుగారు దీర్ఘాలోచనలో మునిగి అటూ ఇటూ పచార్లు చేస్తూంటాడు. ఇంతలో బయట కారు ఆగిన చప్పుడు. బూట్లు టకటక లాడించుకుంటూ సినిమా మనిసి, మరొక వ్యక్తీ లోపల కొస్తారు.

సినిమా మానిసి: "నమస్కారమండి కవి గారూ! వీరు మన 'ఇ ఈ ఫిలిమ్సు' మేనేజింగ్ డైరెక్టరుగారు. మీతో ఒక పెద్దపని వుండి వచ్చాము." ఈ మాట అనేసరికి మేనేజింగ్ డైరెక్టరు హిహిహీ అని కులుకుతాడు.

"ఏమిటా పని" వీరేశ్వరరావుగారు అడుగుతాడు.

"మాకు వేరే పనేముందండి—కళాసేవ తప్ప? చూడండి. మీరు రేపటికల్లా మాకు 'ఉజ్జయినీ సుందరి' అనే పేరుతో ఒక సినిమా కథ రాసిపెట్టాలండి."

"అదేమిటి? ఆ పేరుతోనే రాయాలా? ఇంకో పేరు పెట్టగూడదా?" అంటాడు వీరేశ్వరరావుగారు.

"ఆ. అక్కడేవుంది తమాషా. ఆపేరు వినగానే ఆ ఉజ్జయినీ నగరం, మహారాజులు, సామంతులు, కోటలు, యుద్ధాలు, కవికోకిలలు, అందమైన సుందరాంగుల అందెల సవ్వడులు, ఆహా! ఏమీ చదువు



"ప్రపంచం" కథ రచించిన మిసెస్ మూనాస్.

కోని నాబోటివాడికే కవిత్వం పుట్టుకొస్తోంటే ఇక మీలాంటి కవి శేఖరులమాట చెప్పే దేముంది? ఎంత గొప్ప కథయినా అల్లవచ్చు. కాళిదాసును కథానాయకుడుగా పెట్టి ఓఅమ్మాయిని కథానాయికగా పెట్టి తీశామంటే సినిమా ప్రపంచంలో కావ్యగౌరవం అందుకుంటుంది మనసినిమా. ఏమంటారు?" అని సినిమా మానిసి అంటాడు.

"కాని కాళిదాసును కథా నాయకుడుగా ఉంచి అతగాడికి రోమాన్సు అంటగట్టడం బావుంటుందా? అంతకంటే విక్రమార్కుడినే కథానాయకుణ్ణి చెయ్యకూడదూ?"

"అవును. అది బాగానే వుంటుంది. విక్రమార్కుడూ, కాళిదాసు ఒక ఉజ్జయినీ సుందరికోసం పోటీలు పడ్డట్టు రాయచ్చు."

"అప్పుడు సినిమాకి 'విక్రమార్క' అని పేరుపెట్టాల్సివుంటుంది," అంటాడు వీరేశ్వరరావుగారు.

"కాదుసార్. 'ఉజ్జయినీ సుందరి' అంటేనే బావుంటుంది."

"మీకు ఆపేరుమీదే అంతవ్యామోహం ఎందుకో తెలియకుండా వుంది."

"అసలు రహస్యం చెప్పమంటారా?"

"చెప్పండి."

"నిరుడు మన డైరెక్టరు శంకరంగారు తనదగ్గిర ఒక మంచి సినిమా కథవుందనీ, దాని పేరు 'ఉజ్జయినీ సుందరి' అనీ మాతో చెప్పాడు. సినేరియో కూడా రాసేశానని చెప్పాడు. మేము వెంటనే పత్రికల్లో ప్రకటించాం—"ఇఈఫిలిమ్సువారు సమర్పి

చుమహోన్నత చిత్రం 'ఉజ్జయినీసుందరి' అని. ఇంతలోనే శంకరంగారికి ఏదో బొంబాయి కంపెనీనుంచి పిలుపువచ్చింది. ఆ పెద్దమనిషి మాతో చెప్పకుండా కథా, సినేరియో చంకన బెట్టుకుని చెక్కా పోయాడు. తీరా పత్రికల్లో ప్రకటించి, డిస్ట్రిబ్యూటర్లను మాట్లాడుకుని కూర్చున్నాం. ఇంతలో ఈ అవాంతరం వచ్చింది. అందుచేత ఆ పేరుమీదే మరో కథతియ్యక తప్పని స్థితి వచ్చింది. వచ్చే వారం షూటింగ్ మొదలుపెట్టాల్సిందే. అందుకనే మీదగ్గిరికి వచ్చాం."

వీరేశ్వరరావు గారు ఆలోచనగా నిట్టూర్చి "సరే" అంటాడు.

*Dissolve to*

గోడలమీద ఒక పోస్టరు క్లోజప్‌లో కనిపిస్తుంది:—

## ఉజ్జయినీ సుందరి

### ఉషా ఫిలిమ్సువారు సమర్పించు

### మహోజ్వల చిత్రరాజం

### త్వరలో రాబోతోంది

8. రథచక్రాలు:—నాటకమందిరంలో అప్పుడే 'రథచక్రాలు' అనే విప్లవాత్మక నాటకం ప్రదర్శింపబడింది. తండోపతండాలుగా ప్రేక్షకులు బయటికి వస్తున్నారు. నాటక రచయిత శ్రీనివాసరావుగార్ని తెలిసినవాళ్ళు, తెలియనివాళ్ళు చుట్టూ మూగి కరస్పర్శ చేస్తూ అత్యుత్సాహంగా అభినందిస్తున్నారు. శ్రీనివాసరావుగారు తన నాటకం పొందిన మహావిజయానికి ఉబ్బితబ్బిబ్బులై, అభినందించేవారికి ఏం సమాధానమివ్వాలో తెలియక సిగ్గుపడుతున్నాడు. ఇంతలోనే గుంపును చీల్చుకుంటూ ఇద్దరు వ్యక్తులు రచయితను సమీపించారు. ఒకడు మన సినిమా మానిసి. "ఎంత గొప్ప నాటకం రాశారండీ! శ్రీనివాసరావుగారూ! మా జన్మ తరించింది. ఆహాహా! ఎంత విప్లవభావాలు! ఎంత మానవ కారుణ్యం! అద్భుతం! పరమాద్భుతం!" అంటూ గబగబ ఉపన్యసించి "శ్రీనివాసరావుగారూ! వీ రెవరో తెలుసా? మన ఉషా ఫిలిమ్సు ప్రొడక్షన్ మేనేజరు." అని రెండోవ్యక్తిని పరిచయం చేశాడు సినిమా మానిసి.

"అద్భుతంగా వుందండి నాటకం! న్ని వెంటనే సినిమా తియ్యక పోవటం ంటె ఘోరాపచారం ఉంటదనుకోండి," న్నాడు ప్రొడక్షన్ మేనేజరు.

"అవును. నిజం. ఒక్క ముక్క మార్చకుండా, ఎల్లా వున్న దాన్ని అల్లా సినిమా తియ్యాలి."

"ఎంత గొప్ప సాంఘిక ప్రయోజనం గల నాటకం!"

"జీవితాన్ని ఎంత బాగా ప్రతిబింబిస్తోంది!'

"ఎంత విప్లవాత్మకం"

"సినిమా తీస్తే మారుమూల పల్లెటూళ్ళకూడా మీ నాటకం చొచ్చుకుపోతుంది."

"పల్లెటూళ్ళేమిటండీ? ప్రపంచం నాలుగుమూలలకు రెక్కలు గట్టుకుని ఎగిరిపోదటండీ?"

"ప్రపంచమేమిటండీ? బ్రహ్మాండభాండమంతటిన్నీ తలకిందులుచేసి పారెయ్యదటండీ? సార్, సార్! మీరు ఫిలిం హక్కులు మా ఉషా కంపెనీకి తప్ప ఇంకెవ్వరికీ ఇవ్వకూడదు."

"మీరు వద్దనటానికి వీల్లేదు. వెంటనే కాంట్రాక్టు రాసేసుకుందాం. ఇల్లా రండి సార్!"

(ఒక నెల తరవాత)

సినేరిస్టు: "మీ నాటకంలో ఎక్కడా ఒక్క అక్షరమైనా మార్చలేదండి. (నీళ్లు నములుతూ) కాని - హి - హు - కొంచెం సినిమాటిక్ అవసరాలకోసం మాత్రం ఇక్కడా అక్కడా మార్పులుచేశాం."

శ్రీనివాసరావుగారు: "మార్పులా?"

సినే: "అవునండి. చూడండి. నాటకంలో అంతా ఒక్క సెట్టుమీదే జరుగుతుంది. సినిమాలో అల్లా బావుండదు. అందుకని ఒక సీను చెరువుగట్టున పెట్టాం."

శ్రీని:—"చెరువుగట్టా?"

సినే:—మరేనండి. ఆ సీను చాలా బావుంటుందండి. మా కామెరామన్ ఔట్‌డోర్ దృశ్యాలు చాలా బాగా తీస్తాడండి. ఆ చెరువుగట్టుకు కొంచెం దూరంలో రైలు పట్టాలు, వాటిమీద ఎక్స్‌ప్రెస్ బండి పోవటంకూడా కనిపిస్తుంది.

శ్రీని:—ఎక్స్‌ప్రెస్ బండి దేనికి?

సినే: కథకి టెంపో ఉండాలి కదండీ? అందుకు. ఇంకో సీను ఒక పెద్దమేడ బాల్కనీ మీదపెట్టాం.

శ్రీని: మేడ ఎక్కడిదీ? నా నాటకంలో మేడలేదే?

సినే:—సినిమాల్లో మేడలు లేకపోతే ఎల్లాగండీ? అందులో మేడమీంచి షాట్ తీస్తే ఎంత గొప్ప ఎఫెక్టువస్తుందో తెలుసా? ఈ కాస్త తప్ప ఇంకొక్కమాట కూడా మార్చలేదు.

(ఒకవారం తరవాత)

ప్రొడ్యూసరు:—మంచి స్టార్ నటుల్ని బుక్ చేశామండి. విప్లవనాయకుడి పాత్ర మన భాగేశ్వరరావు ధరిస్తాడు.

శ్రీని:—అతడా? అబ్బే. భాగేశ్వరరావు ఆ పాత్రకి మరీ చిన్నవాడైపోతాడే!

ప్రొడ్యూ:—అవుననుకోండి. కాని ప్రజలు భాగేశ్వరరావు తెరమీద కనబడితే చాలు, అంతా మరిచిపోతారు. కొంచె



మే 16 న శత దినోత్సవ సందర్భంలో విజయవాడ వచ్చిన "బ్రతుకు తెరువు" బృందం వారికి ఆంధ్ర ఫోటోగ్రాఫర్స్ ఎసోసియేషన్ వారు సన్మానం చేశారు. కూర్చున్నవారిలో ఆర్. నాగేశ్వరరావు, ఎ. నాగేశ్వరరావు, రంగారావు, రామకృష్ణ, భానుమతి సూర్యకాంతం, సముద్రాల, భాస్కరరావు గార్లను చూడవచ్చును.



పారమౌంట్ వారి "మైసన్ జాన్" చిత్రంలో నటిస్తున్న హెలెన్ హేస్. ఇది జూన్ 5 వ తేదీన ఓడియన్ సినిమాలో విడుదల కానున్నది.

# ★ సినిమా ఎల్లా తీస్తారు? ★

అతని పోర్షన్ మారిస్తే అంతా సరిగ్గా వుంటుంది.

శ్రీని:—క్షయ రోగంతో బాధపడే అతని కూతురు వేషం ఎవరి కిస్తారు?

ప్రొడ్యూ:—కూతురుగా వుంటే బావుండదు. అందుకని ఆమెని అతడి ప్రేయసిగా మారుద్దాం. ఆమెని లక్షాధికారి కూతురుగా చేస్తే సరిపోతుంది.

శ్రీని:— దేనికి?

ప్రొడ్యూ:—సాంఘిక చిత్రంలో అల్లాగే ఉండాలండి. అప్పుడు గాని అటు ధనికుల జీవితానికీ ఇటు కార్మికుల జీవితానికీ తేడా బాగా కనిపించదు. పైగా ప్రజలకి ధనికులవిలాసజీవితంమీద మోజెక్కువ. ఆ కూతురు పాత్ర మన ..(చెవిలో రహస్యంగా) ధరిస్తుంది. ఏం? బాగా సెలెక్టు చేశామంటారా, లేదా? ఆమెచేత నాలుగు భావగీతాలు పాడించి, ఒక నాట్యం చేయించి, ఒక కారుకూడా డ్రైవ్ చేయించామంటే - ఓ, ఇక చూస్కోండి, మన సినిమా. ఈ కాస్తా తప్ప ఇంకొక్క ముక్కయినా మార్చనక్కర్లేదు.

(పది హేనురోజుల తరవాత)

ప్రొడ్యూ:—శ్రీనివాసరావు గారూ! మీ నాటకంలో సంభాషణలు కొంచెం ఘాటుగా ఉన్నాయండీ. అలా వుంటే సెన్సార్లు ఒప్పుకోరు. అందుచేత మనమే కొంచెం మారిస్తే బావుంటుంది.

శ్రీని: అదేమిటే? నాటక రంగంమీద ఒప్పుకున్నవారు సినిమాలో ఎందుకొప్పుకోరు?

ప్రొడ్యూ:—మీకు తెలియదు లెండి. సినిమా సెన్సార్ షిప్ చాలా కఠినంగా వుంటుంది. అదీ గాక ముగింపు మరీ ట్రాజిక్ గా వుంది. అందుచేత అది కూడా మార్చాలి. లక్షాధికారి కుమార్తెను కార్మిక నాయకుడు పెళ్ళిచేసుకున్నట్లు మారుద్దాం.

శ్రీని:—అలా చేస్తే కథలో నే నివ్వదలచిన సందేశం ఒకటి, తయారయ్యేది ఇంకోటి అవుతుంది.

ప్రొడ్యూ:—అవును. ఏం చేస్తాం? ఆ సెన్సార్ పెద్ద మనుషుల్ని కూడా దృష్టిలో పెట్టుకుని మరీ సినిమా తియ్యాలిగదా!

(ఒక వారం తరవాత)

ఒక లావాటి పెద్దమనిషి శ్రీనివాసరావు గారితో మాట్లాడుతూంటాడు: "నేను ఉఊ ఫిలిమ్స్ వెనకాల మనుషుల్లో ఒకణ్ణి. అంటే నేను కూడా పెట్టుబడి పెట్టిన వారిలో ఒకణ్ణి. కనుక మనం తీస్తున్న సినిమా బాగుండాలని నాక్కూడా అనిపించటం సహజం. ఆర్థికంగా విజయంపొందాలనే కాక, నైతికంగాను, ఆర్టిస్టిక్ గాను కూడా మన సినిమా వేలెత్తి చూపించటానికి లేకుండా ఉండాలని నా కోరిక. ఏమంటారు? మీ నాటకంలో విప్లవాత్మక భావాలపాలు ఎక్కువగా ఉందనీ, అందమూలంగా దానిలో కళ కొంచెం దెబ్బ తింటోందని నా కెందుకో అనుమానంగా ఉంది. మీ హీరో బొత్తిగా కార్మికుడుగా ఉండటం బాగులేదు. అతన్ని మంచి తెలివితేటలుగల సైంటిస్టుగా చేస్తే బాగుంటుంది. ఫ్యాక్టరీలో యంత్రం పాడైనట్లు, మన సైంటిస్టు వచ్చి దాన్ని బాగుచేసినట్టు యంత్రం బాగుపడగానే కార్మికులంతా చాలా సంతోషించినట్లు కథ మారుద్దాం. ఇంతకు తప్పిస్తే అమోఘమైన మీ నాటకరాజంలో ఒక్క ముక్క కూడా మార్చనక్కర్లేదు. ఇదయినా కేవలం కళ కోసం తప్ప....."

(రెండు నెలల తరవాత)

ప్రొడ్యూసరు (టెలిఫోనులో):— "ఆ. అవుననుకోండి. మీరన్నట్టు ఆ సీను చాలా గొప్పదే. కాని కొంచెం పెద్దదైపో యింది. అందుచేత పొడుగు తగ్గించాం. అక్కడ హీరో రెండు వాక్యాలకంటే ఎక్కువ మాట్లాడితే బావుండదు. ఆ రెండు వాక్యాలూ అసలైనవి, మంచి ఘాటైనవి ఉంచాము. అవి చాలు. ఆ వాక్యాల్లో మీ నాటక సారాంశం, మీ రనుకునే సాంఘిక ప్రయోజనం అన్నీ వచ్చేస్తాయి. ఆ. దాదాపు పూర్తయినట్టే. మీకు త్వరలో చూపిస్తాము. మేము చేసిన మార్పులు మీరు

(50-వ పేజీ చూడండి)

# ప్రశ్నలు-సమాధానాలు

శ్రీ సి. హెచ్. శ్రీనివాసరావు—జమ్‌షెడ్‌పూర్.

'డబ్' అంటే ఏమిటి? అది చిత్రాలలో ఎందుకు ఉపయోగిస్తారు?

—చలన చిత్రానికి శబ్దం జోడించటాన్ని డబ్బింగ్ అంటారు.

ఒక భాషలోని చిత్రాన్ని మరొక భాషలోనికి తర్జుమా చెయ్యటాన్నికూడా డబ్బింగ్ అంటారు.

*　　*　　*

శ్రీ వి. శ్రీనివాసరావు—కోటపోలూరు.

హిందీచిత్రాలు 'ఫెయిల్' కాకుండుటకు గల కారణము మహాశయా?

—ఇటీవల హిందీచిత్రాలుకూడా బాగా నష్టపోతున్నాయి. ఇదివరకు వచ్చే రాబడిలో నూటికి నలభైవంతులదాకా ఇప్పుడు తగ్గిపోయిందట.

*　　*　　*

శ్రీ. జి. వెంకటచలం—అమలాపురం.

ప్రస్తుతము సినీనటుడు ఎన్. టి. రామారావుతీయుచున్న చిత్రమేమి? దానిలోని నటీనటు లెవరో తెలిపెదరా?

—నేషనల్ ఆర్ట్ ప్రొడక్షన్సువారి "పిచ్చిపుల్లయ్య". ఈచిత్రానికి దర్శకుడు శ్రీ తాతినేని ప్రకాశరావు. ఎన్. టి. రామారావు, అమరనాథ్, జానకి మొదలైనవారు నటిస్తున్నారు.

*　　*　　*

శ్రీమతి చిట్లూరు. శాంతకుమారి—కాకినాడ.

లోగడ మీవారపత్రికలలో ప్రచురింపబడిన "మిత్ర భేదము," "మిత్రలాభము" అను బొమ్మల సీరియల్ కధలు మాలాటి పిల్లలు చదువటకెంతో బాగున్నవి. శ్రీ పరవస్తు చిన్నయసూరిగారు రచించిన "పంచతంత్రము"లోని మిగతా సంధి విగ్రహము కథలుకూడా ఎప్పటినుంచి ప్రచురిస్తారు?

—పరవస్తు చిన్నయసూరిగారు మిత్రభేదం, మిత్రలాభం మాత్రమే అనువదించారు. ఆయన తీసుకున్న సంస్కృత గ్రంధం 'పంచతంత్రం' కాదు; హితోపదేశం. హితోపదేశంలో మిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహము అనినాలుగు మాత్రమే విభాగాలున్నాయి. మేము బొమ్మల కథగా వేస్తున్నది 'పంచతంత్రం' కనుక, మొదట మిత్రభేదంతో ఆరంభించి, మిత్రలాభం కూడా పూర్తిచేశాం. ఇక, మీ స్కూలు పిల్లలకందరికీ పరిచయమైవున్న కందుకూరి వీరేశలింగంగారి 'సంధి విగ్రహం'త్వరలో ప్రచురించబోతున్నాం. తదనంతరము 'లబ్ధనాశము', 'అసంప్రేక్ష్యకారిత్వము' అనబడే ఆ రెండు తంత్రాలను కూడా ప్రకటించదలచుకొన్నాం.

*　　*　　*

శ్రీమతి యన్. యస్. వి. పద్మావతి—గుంటూరు.

22-4-53 ఆంధ్రపత్రికలో "ఒక వ్యక్తి ఏ చిత్రానికైనా డైరక్టరుగా, హీరోగా, రచయితగావుండి చిత్రంతీస్తే రాణించుతుందా రాణించదా" అన్న ప్రశ్నకు అంత సర్వతోముఖమైన ప్రతిభ కలవారు మనలో లేరని ఒక్క చార్లిచాప్లినేనని సమాధానమిచ్చారు. "చండీరాణి" త్రిభాషా చిత్రానికి కథారచన, సంగీతము, దర్శకత్వము స్వయంగా తాచే నిర్వహిస్తూ ద్విపాత్రాభినయం చేస్తున్న మన తెలుగుతార భానుమతి అంత సర్వతోముఖమైన ప్రతిభ గలదని నా అభిప్రాయం. మీరేమంటారు?

—చిత్ర నిర్మాణంలోని వివిధశాఖలను నిర్వహించినవారు చాలమందే ఉన్నారు. ప్రతిభావంతంగా నిర్వహించినవారు లేరని మాత్రమే మా అభిప్రాయం. "చండీరాణి" విడుదల అయిన తర్వాత శ్రీమతి భానుమతి సర్వతోముఖమైన ప్రతిభ గలదని వెల్లడయితే అది మనకందరికీ సంతోషకారణం అవుతుంది. మనకొక "చార్లీ చాప్లిన్" లేని కొరత తీరుతుంది.

*　　*　　*

శ్రీ వి. వి. వి. కృష్ణమూర్తి—విజయవాడ.

గేయకవిత్వమంటే యేమిటి? పద్యకవిత్వమునకు గేయకవిత్వమునకు భేదమేమి? భావకవిత్వము గూర్చి నాకు విపులముగా తెలుప ప్రార్థిస్తున్నాను. ఈ భావకవులంతా యెట్టి ఛందస్సు వాడుతారు? భావకవులంతా ఒకే పద్ధతిలో తమ కవితలు వ్రాస్తారా?

—'గేయం' అంటే పాడదగినది. గేయాలు మాత్రా ఛందస్సులో రాస్తారు; పద్యాలు గణఛందస్సులో రాస్తారు.

ఈ శతాబ్దంలో బయలుదేరిన ఒకానొక కవిత్వధోరణికి భావకవిత్వం అని పేరు వచ్చింది. అదేమిటో తెలుసుకోవాలంటే మీరు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణ, నాయని సుబ్బారావు మొదలైనవారి రచనలు చదవండి.

భావకవిత్వం మాత్రా ఛందస్సులోనూ, గణ ఛందస్సులోనూ రాయవచ్చు. ఈ రెండూ కాకుండా స్వేచ్ఛా ఛందస్సులో కూడా రాయవచ్చు.

*　　*　　*

శ్రీ పి. ఆర్. రావు—నెల్లూరు.

రాజకీయరంగంలో ప్రఖ్యాతి గడించిన నటుడుగాని నటిగాని ఎవరైనా వున్నారా?

—లేకేమి? రాజకీయ నాయకులంతా నటనలో ప్రసిద్ధులే.

సినిమాహాల్లో ముందు వరసలో, బాగాలావు, ఎత్తు వున్న మనిషిఒకడు కూర్చొనివున్న కారణంచేత, ఆయనకి వెనకాలగా వున్న సీటులోని మనిషికి తెరమీది బొమ్మ ఏమీ కనిపించకుండా పోయింది. అక్కడికీ చాలాసేపు ఓర్చుకొని, చివరికి, ఆయన భుజంతట్టి "నాకు తెర మీద బొమ్మ కనిపించటం లేదండీ" అన్నాడు, విధేయత పుట్టిపడే కంఠ స్వరంతో.

"అయ్యో! పాపం! బొమ్మ కనిపించటం లేదా? చ్చ్... చ్చ్...పోనీ ఒకపని చేయండి. నావంకే చూస్తూ, సరిగ్గా నేను ఎప్పుడు నవ్వుతానో చూసి, అప్పుడే మీరూ నవ్వెయ్యండి. సమస్య తీరిపోతుంది." అని సమాధానం యిచ్చాడు ఆ స్థూలకాయుడు.

# సినిమా ఎల్లా తీస్తారు?

(48-వ పేజీ తరువాయి)

కూడా సంతోషిస్తారని మా నమ్మకం. అది తప్ప మీ నాటకంలో ఒక్క ముక్కయినా మార్చటం లేదు..."

(రెండు నెలల తరవాత)

(ప్రొడ్యూసరు (టెలిఫోనులో) :— అవును. నేనే. షూటింగ్ పూర్తయింది. ఆ రెండు వాక్యాల సంగతి అడుగుతున్నారా? వాటిని ఎడిటింగ్‌లో విధిలేక తీసెయ్యాల్సివచ్చింది. ఆ వాక్యాల మూలంగా టెంపో చెడిపోతోందని తీసేశాము. మీరు చూస్తారుగా. మీరేమీ కనిపెట్టలేనంత ఇదిగా మార్పు చేశాం. అసలెందుకు—మీ నాటకం మీరే గుర్తుపట్టలేనంత అద్భుతంగా తయారైందంటే నమ్మండి... ఆ...తప్పకుండా రండి. ఉంటా..."

(సశేషం)

# సినిమా వార్తలు

సొసైటీ పిక్చర్సువారు తెలుగు తమిళ భాషల్లో తీస్తున్న "ప్రపంచం" చాలా వరకు అయిపోవచ్చింది. ఈ చిత్రనిర్మాత సింహాళీయులు మూనాస్; కథ శ్రీమతి సి. పి. మూనాస్; దర్శకుడు రామచంద్రన్; తారాగణంలో జి. వరలక్ష్మి, రామశర్మ, జానకి, సుబ్బారావు మొదలైనవారున్నారు; స్టూడియో స్టార్ కంబైన్సు.

* * *

భాస్కర్ ప్రొడక్షన్సువారి "బ్రతుకు తెరువు" చిత్రం ఈ నెల 16 వ తేదీన విజయవాడలో శతదినోత్సవం జరుపుకున్నది. ఈ చిత్రంలో నటించిన నటీనటులు, దర్శకుడు రామకృష్ణ, పి. భానుమతి, నిర్మాత భాస్కరరావు, కవి సముద్రాల తదితర ప్రముఖులు ఈ సందర్భంలో విజయవాడ వెళ్ళి ఉత్సవంలో పాల్గొన్నారు. భానుమతి ఆ సభకు అధ్యక్షత వహించారు. విజయవంతమైన చిత్రం తయారుచేసినందుకు భాస్కరరావుగార్ని, రామకృష్ణగార్ని, సమర్థతతో నటించిన నటీనటులను, ఇతర టెక్నీషియన్లను అభినందిస్తూ విజయవాడ కాలేజీ ప్రిన్సిపాలు శ్రీ ఎమ్. రాఘవాచార్యులు, కవి జి. జాషువా, విజయవాడ రేడియో అసిస్టెంటు డైరెక్టరు అయ్యగారి వీరభద్రరావు, వెనుకపల్లి పట్టాభిరామయ్య, శ్రీమతి కాంచనపల్లి కనకాంబ గార్లు ప్రసంగించారు. వివిధ సంస్థల తరఫున సన్మానపత్రాలు, బహుమతులు సమర్పించబడినవి. రేలంగి, నాగేశ్వరరావు తదితరులు తమకు చేయబడిన సన్మానానికి కృతజ్ఞతతో సమాధానం చెప్పారు. ఆర్యాత్రి లక్ష్మీటాకీసు అధిపతి శ్రీ మిద్దె రామకృష్ణరావుగారు అతిథులకు విందు చేశారు.



జూపిటర్ వారి "ఇనే.క్కరు" లో అంజలీదేవి, టి. కె. షణ్ముగం.



జూపిటర్ వారి "ఇన్స్పెక్టరు" లో పి. కె. సరస్వతి నృత్యభంగిమ.

# కాలక్షేపం

(8-వ పేజీ తరువాయి)

ఉంటే ఆ వృత్తిలో చేరవలెననే ఆశ కలిగి భ్రమరంలాగు పరిభ్రమిస్తూ ఒక పువ్వు నుంచి ఇంకో పువ్వుకు తిరుగుతూ ఉండ కూడదా అని వాదిస్తారు కొందరు విద్యార్థి కోరులు. కాని సకల విద్యాప్రవేశ పరిచయంవల్ల ఏ విద్యలోనూ ప్రావీణ్యం వృద్ధి పొందదు. వృత్తివిద్యలలో స్థిరచిత్తం ఉంటేనేగాని, ఉత్తమ ప్రావీణ్యం ఏర్పడదనేమాట విద్యార్థికోరులు కూడా అంగీకరిస్తారు.

ఏవిద్యార్థికి ఏశాస్త్రంలో ప్రత్యేక అభిరుచి ఉంటుందో బాల్యంనుంచీ కనిపెట్టి, దానినే ప్రోత్సహించి పోషించి సానబెట్టినట్టుగా సాధకం చేయించవలెనని నవీన విద్యావిధాన సిద్ధాంతంగా ఉంది. ఒక తరగతిలో ఉన్న బడిపిల్లలయొక్క సహజ స్వభావ లక్షణ ప్రవర్తనలను ఉపాధ్యాయుడు శ్రద్ధగా కనిపెట్టి పరీక్షించి ఒక రిజిస్టరులో వ్రాస్తూఉండవలెనని అమెరికాలోని స్కూళ్ళ ఇనస్పెక్టరొకరు ఉత్తరువుచేశారు. ఒక విద్యార్థి క్లాసులో కూర్చున్నంతసేపూ తన కాళ్ళు రెండూ ఆడిస్తూ ఉండేవాడు. ఆ విషయాన్ని ఉపాధ్యాయుడు రిజష్టరులో నమోదు చేశాడు. స్కూళ్ళ ఇనస్పెక్టరు తనిఖీకి వచ్చినప్పుడు రిజిస్టరులో చూచాడు. ఆవిధంగా కాళ్ళు ఆడిస్తూ ఉండే విద్యార్థికి అది సహజగుణం గనుక, ఆ విద్యార్థిని బట్టలుకుట్టే యంత్రం దగ్గర కూర్చుండబెట్టి బట్టలు కుట్టడం నేర్పితే వృద్ధిలోకి వస్తాడని ఇన్స్పెక్టరు నిర్ణయించాడు.

ఈ విధముగా ఒక్కొక్క విద్యార్థికి ఒక్కొక సహజస్వభావం ఉంటుందనిన్నీ ఆ స్వభావలక్షణానికి అనుకూలమైన వృత్తి విద్యను ఆ విద్యార్థికి నిర్ణయించి బాల్యం నుంచీ నేర్పవలెననిన్నీ ఆ విద్యాబోధకుని సిద్ధాంతం: కాని, ఆ రీతిగా కాళ్ళు ఆడిస్తూ ఉండేవిద్యార్థికి చాలా చక్కని శ్రావ్యమైన గాత్రం ఉండేది. అతడు పెరిగి పెద్దవాడైనతర్వాత సంగీతంలో ఎక్కువ అభిరుచి కలవాడై దానినే సాధకం చేసి సినిమాలలో పెద్దపాటకుడైనాడు. కుట్టు యంత్రంవల్ల జీవించడంకంటె సినిమాలలో చేరి ఎక్కువ ద్రవ్యం గడించడానికి అతనికి అవకాశాలు లభించాయి. ఈ అవకాశాలు అతనిని ఆకర్షించాయి ఎక్కువగా.

ఒక సత్రంలో ఒక మంగలియున్నూ ఒక కుట్టుపనివాడున్నూ కాకతాళీయంగా సమావేశమైనారు. ఆ మంగలికి తన వృత్తి గిట్టుబాటుగా కన్పించక "ఏదీ గతి నాకు" అని ఆలోచిస్తూ ఉన్నాడు. కాని పైకి ధీమాగా, మేకపోతు గాంభీర్యంగా తన మంగలిపొదితో రోజుకు రూపాయి డబ్బులు అవలీలగా సంపాదిస్తానని ఆ సత్రంలో దిగిన దర్జీవానితో అన్నాడు. కాని ఆ దర్జీవాడు మరింత దర్జాగా, తన సూదీ,దారంవుండా చూపించి ఈ రెంటితో రోజుకు వరహా సంపాదిస్తానని బడాయిగా అన్నాడు. ఆ మాట ఆ మంగలి విని అలాగయితే యీ పొది నీకు యిస్తాను. ఈ కత్తీ యీ కత్తెర ఉపయోగించడం నీకు నేర్పుతాను. దయచేసి నీ సూదీ దారం నాకు ఇచ్చి బట్టలు కుట్టడం నేర్పుతావా? అన్నాడు. సరేనని ఉభయులూ ఒప్పందం చేసికొని ఉపకరణాలు మార్చుకొని, ఉపాధులు మార్చుకొని ఎవరిఊరికి వారు వెంచేశారు. దర్జీమంగలి కొత్తగా కత్తి చేతపట్టి క్షవరం చేయడం ప్రారంభించాడు. అదివరలో కుట్టుపనిచేసిన కాలంలో మధ్యమధ్య కుట్టుపని ఆపి, తన జుట్టుముడిలో సూదిని గుచ్చుకొనడం అలవాటు. వెనుకటి అలవాటు చొప్పున, క్షవరం చేస్తూ చేస్తూ మధ్య, మధ్య ఆగి మంగలికత్తిని తన తలలో జుట్టుముడిలో గుచ్చడం ప్రారంభించాడు. ఈ విధంగా చేయడం వల్ల అతని తల అంతా గాట్లుపడి గాయాలై రక్తసిక్తమైంది. దర్జీమంగలి సంగతి, యీ గతి యీ రీతి అయింది.

ఇక మంగలిదర్జీపని ఇంతకంటె అధ్వాన్నమైంది. అదివరకు పూర్వాశ్రమంలో మంగలిపని చేసినప్పుడు మధ్య మధ్య క్షవరం చేయడం రవ్వంత ఆపి, కత్తిని తన ముంజేతి మీద అటు యిటు రుద్ది పదునెక్కించడం అతనికి అలవాటు. అదే ప్రకారంగా యిప్పుడు బట్టలు కుట్టుతూ, కుట్టుతూ రవ్వంత అగి, ఆసూదిని కొంచెం వాడిగా చెయ్యవలెననే ఉద్దేశంతో తన ముంజేతి మీద సూదిని ఇటూ అటూ రుద్దడం సాగించాడు. ఆ సూదిమొన అనేక పర్యాయములు గుచ్చుకొని కొల్లలుగా రక్తం పైకి చిమ్మింది. దర్జీమంగలి తన అవస్థఅంతా మంగలిదర్జీకి మనవి చేసికొన్నాడు. మంగలి దర్జీకూడా తన బాధ తాను నివేదించాడు. చిట్టచివరకు ఎవరి ఆయుధాలు వారే తీసికొని ఎవరి పూర్వవృత్తిలో వారుచేరి స్థిరచిత్తులై ఉపాధి మార్చడం అపాయం అని గ్రహించారు. వృత్తివిద్యయే ఉత్తమవిద్య అనిఉద్ఘాటించేసందర్భంలో విద్యకుప్రయోజనం విత్తం. ఆ ద్రవ్యానికి ప్రయోజనాలు మూడే ఉన్నాయి. "దానము, భోగము, నాశము"-దానం చేసే మానవుల సంఖ్య లెక్కకు మిక్కిలిగా ఎప్పుడూ ఉండెదు. ధన నాశనమునకు మనస్సు ఒప్పదు. కాబట్టి భోగము అనేది ఒక్కటే భూలోకవాసుల ద్రవ్యానికి తగిన దివ్య ప్రయోజనం కనుక, విద్యవల్ల విత్తం అభిస్తే శకోటికి పడగఎత్తకూడదంటావా?

అందమైనకారులో ఆనందంగా తిరుగకూడదంటామా? సిల్కుబట్టలు కట్టరాదని కట్టడిచేస్తామా? తారను మించిన తారహారాలు వేసికొని విహారం చేయవచ్చు.

అంబ! నవాంబుజోజ్వల కరాంబుజ!
శారద చంద్రచంద్రికా
డంబరచారు మూర్తి! ప్రకటస్ఫుట
భూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ! శ్రుతిసూక్తవివిక్త
నిజప్రభావ భా
వాంబరవీధి విశ్రుతవిహారిణి!
నన్ గృపజూడు భారతీ!

సరస్వతీదేవికి నవరత్న మణిమయ భూషణాలంకారములు ఉన్నాయి. రత్న ఖచిత కిరీటంవుంది. "ప్రకటస్ఫుట భూషణ రత్నదీపికా చుంబిత దిగ్విభాగ" - తేజోవికాసంగల ఆమెయొక్క ఆభరణాలంకారముల దీప్తులు దశదిశల వ్యాపించినవి. ఆమెకు అనేక భూషణాలంకారములు ఉన్నట్లుగా కన్పిస్తోంది. కాని, యీ కాలపుస్త్రీలకు ఉన్నటువంటి కొన్ని భూషణాలు అనగా, చేతిసంచీ, రిస్టువాచీ, కళ్ళజోడూ, యివి మాత్రం సరస్వతీదేవికి ఉన్నట్లుగా కన్పించవు.

మనం సరస్వతీదేవికికూడా రత్న ఖచిత కిరీటం అలంకారంగా తగిలించి, ఆమె పటం గోడకు తగిలించి ఆరాధిస్తున్నాము. ఆ చదువుల తల్లికి కడుపునిండా విద్య ఉంటే ఆనవరత్నకిరీటం అనవసరమేగదా!

"వాగ్భూషణమే సుభూషణము;
భూషణముల్ నశియించు నన్నియున్"

అనే ధోరణిలో లేదు మన విద్యా విధానం.

సుబ్బారావు అనే యువకుడు రాత్రుళ్ళు టీ త్రాగి, నిద్రమేల్కొని, కష్టపడి కాలేజీలో చదువుకొన్నాడు. దేశచరిత్రలో యం. ఏ. (మాస్టర్ - ఆఫ్-ఆర్ట్స్ - అనగా కళాప్రవీణ) అయినాడు. సంసారం జరుగుటకు తగిన ఉద్యోగం ఉపాధి లభించక ఆఖరుకొక ఉపాయం ఆలోచించాడు. "కళా ప్రవీణ కాఫీ హోటల్" అనే పేరుతో ఒక కాఫీ హోటల్ పెట్టి గట్టిపట్టుదలతో, కృషి చేసి పిండి వంటలలో ప్రవీణుడైనాడు. కావలసినంత సంపాదించి కాలుమీదకాలువేసికొని ఖాన్ బహాదూర్ లాగున కాలక్షేపం చేస్తున్నాడు. కాని, అతను చదివిన చదువు అంతా "నహి నహిరక్షతి డుకృఞ్కరణే" అన్నట్లయింది. అతనిచదువు అడవిని కాసిన వెన్నెలచందమైంది. అది ముక్తివిద్య కాదు, భుక్తివిద్య కాదు, వృత్తివిద్య కాదు, రిక్తవ్యర్థ విద్య అన్నట్లయింది. ఈవిధంగా ఒక విద్య చదివి దానివల్ల భుక్తిమార్గం లేక మరొకవృత్తిలో క్షణపొందే యువకులు అసంఖ్యాకులు. ★

 

# ★ పందెం ★

(36-వ పేజీ తరువాయి)

ముదరకాయలు గుల్లు పొడుచుకు తినేసరికి మా వేళ్ళు విరిగినంత పనయ్యేది.

ఆఖరికి ఎలాగయితే నేం పందెం పూర్తయింది. మేం తిన్న ముంజికాయ గుల్లలు లెక్క పెట్టించింది అత్తయ్య. మాముగ్గురు లోకీ నేను తిన్నవే ఎక్కువున్నాయి. (సగం సగమే తినడంచేత) అత్తయ్య తన రొంటిన పెట్టుకున్న రూపాయి కాసుతీసి నాకిచ్చేసింది.

నేను వెంటనే ఇంట్లో కెళ్ళి గుప్పెడు బియ్యం తీసుకొని తినే శాను మా ఆచార ప్రకారం. (ముంజికాయలు ఎంత లేత కాయలైనా ఎక్కువగా తింటే కడుపు నొప్పి వస్తుందని, అవి తినగానే బియ్యపు గింజలు తింటే అల్లాంటి కడుపు నొప్పిగాని మరేవ్యాధిగానీ రాదని మాకు గట్టి నమ్మకం)

మా పెద్ద నాన్నగారి పిల్లలు బియ్యం తినలేదులావుంది. వాళ్ళకి సాయంకాలానికి కడుపునొప్పి వచ్చేసింది. ఆ కడుపునొప్పి వారం పదిరోజుల దాకా తగ్గనేలేదు. నాకు మాత్రం వేళ్ళు పచ్చిపుండ్లు అయిపోయాయి. (అదంతా ముదురు కాయల మహాత్మ్యం లెండి.)

ఆరోజు లగాయతు ఎప్పుడేనా ఎవరైనా పందెం వేస్తున్నారంటే, నాకు ఆనాటి ఈసంఘటనే జ్ఞాపకం వస్తూవుంటుంది.

★

# ★ దత్తత ★

(25-వ పేజీ తరువాయి)

చూశాడు రవి. ఆమె తలక్రిందకు వంచి ఏదో ఆలోచిస్తుంది.

"నేను వెళతానమ్మా"

"భోజనం?"

"నువ్వు?"

ఆమె మాట్లాడలేదు. రవి తల్లిచేయి పట్టుకున్నాడు.

"నువ్వు తింటేనే గాని నేను తినను."

లక్ష్మి నవ్వుకుంటూ లోపలకు వెళ్ళిపోయింది.

శాంతమ్మ మెల్లగా లేచింది. మాతృపుత్ర సంబంధంలో ఏలాంటి మధురత నిండిఉందో అని ఆలోచిస్తూ ఆనంద బాష్పాలు తుడుచుకుంటూ ధర్మయ్య వాళ్ళే యిద్దర్నీ చూస్తూ నిలబడిపోయాడు.

చావిట్లో పంకాక్రింద కూర్చొని సిగరెట్టు పీలుస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్న రామునకు మోటర్ సైకిల్ ధ్వని వినిపించింది. మిట్టమధ్యాహ్నం ఎవరా వచ్చేదని తలతిప్పి చూశాడు.

రవి మోటర్ సైకిల్ కుస్టేండ్ వేసి, మెట్లు ఎక్కి గుమ్మందగ్గరగా వచ్చి నిలబడ్డాడు.

రాము ముందే గుర్తించడంవల్ల అలాగే కూర్చొని "రవి! లోపలకి రావొచ్చు" అన్నాడు.

చిన్నతనంలో చూసిన ఆ భవంతిని పరిశీలిస్తూ రవి రాము దగ్గరగా వెళ్ళాడు.

"కూర్చో"

రవి కూర్చున్నాడు. రాము ఆ రెండు మాటలు రవికి కొంత ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఆశ్చర్యమే కాదు అలాంటి ఆహ్వానం లేకపోతే తనస్థితి ఏమయ్యేదో ఆలోచిస్తున్నాడు. విన్న తాను చేసిన లోపం ఈ సంఘటనద్వారా, ద్విగుణీకృతమై అతని ఎదురుగా కనిపిస్తోంది.

రాము సిగరెట్టుటిన్ను చూపుతూ "తీసుకో" అన్నాడు.

"అలవాటు లేదు" రవి మాటలో నమ్రతతో, సిగరెట్టు కాల్చని నియమం రాముకి సంతోషాన్ని కలిగించింది.

"ఈ మధ్య నువ్వు నేర్చుకోలేదూ?"

"లేదు"

సమాధాన మిచ్చి మెదలకుండా కూర్చున్నాడు. వచ్చిన విషయాన్ని కదపడం అతనిలోని అభిమానం ఆమోదించడంలేదు.

"ఏమిటి యింత ఎండలో వచ్చావ్."

రవి వెంటనే సమాధానం యివ్వలేదు. రాము ఆశ్చర్యంగా అలాగే చూస్తున్నాడు. రవి లేచాడు "నీకు నా మీద కోపం వచ్చిందా?" అని అడిగాడు.

"లేదే" కూర్చొనే సమాధానమిచ్చాడు.

"నీకు లేకపోయినా అమ్మకు కోపం వచ్చింది; నా లోపం ఏదన్నా ఉంటే ..." మిగతామాట పెగల్లేదు.

రామునకు అతని సిగ్గుతో నిండినముఖం చూసి నవ్వొచ్చింది. నవ్వుతూ పైకి లేచి, రవి భుజంమీదచరుస్తూ, "నీతత్వం మొదటి నించీ యింతే తెలుసుండి నేనెందుకు కోపం చేసుకుంటాను... ఈమాత్రం దానికి క్షమాపణ ఎందుకూ" అన్నాడు.

రవి మనస్సు తేలికపడింది.

"సరే! వెళతాను తప్పకుండా యింటికి వస్తూ వుండు."

రవి వెళ్లి మోటర్ సైకిలెక్కాడు, రాము అటే చూస్తున్నాడు.

"ఎవరూ?"

ఈ ధ్వని విని రాము వెనక్కి తిరిగి చూశాడు. మేడ మెట్ల మధ్యలో గంగాధరం గంభీరవిగ్రహం కనిపించింది. సిగరెట్టు టిన్ను తండ్రికి కనిపించకుండా దాచే ప్రయత్నంలో ఉన్నాడు.

"వచ్చింది ఎవర్రా?" మళ్లీ అదే ప్రశ్న వేశాడు గంగాధరం.

"ఒక స్నేహితుడు"

"పేరు వినకూడదా?" మెట్లు దిగుతూ అడిగాడు.

"రవి...అంటారు."

గంగాధరం రాముకేసి అలాగే చూసి వెనక్కి తిరిగి మేడ ఎక్కడానికి ప్రయత్నిస్తూ "రవా?" మళ్లీ రాముని చూసి "మోటార్ సైకిలుందా" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏదో రికేరుకు వచ్చిఉంటుంది."

జమీందారు నవ్వాడు. ఆ నవ్వులో క్రితం ఉన్నంత బింకంలేదు. ఏదో కనిపించని మలినభావం ఆ నవ్వులో ఉంది" మంచి స్నేహితుడ్నే సంపాదించావ్..." అంటూ తిరిగి మేడమీదకు వెళ్లిపోయాడు.

## 17

శాంతమ్మ భర్తపోయిననాటినుంచీ, ఏసంవత్సరమూ ఆయన పోయిన దినాన్ని ఉపేక్ష చేసి ఊరుకోలేదు. బిడ్డలు చిన్నవాళ్ళుగా ఉన్నప్పుడు తనే ఉదయాన స్నానంచేసి పిండోదకాలు విడిచిపెట్టేది. పవిత్ర భావంతో ఆరోజంతా ఆయన

# ★ దత్తత ★

ణామాన్ని జపిస్తూ ఉపవాసంతో గడిపేది. అదీకూ ఆమెకు ఎంతో సంతృప్తినీ, మానసిక ఆనందాన్నీ కలిగించేది.

తరువాత ధర్మయ్య యింటికి చేరినాక, పురోహితుని పిలిపించి, చిన్నవాడుగా ఉన్న రవితోనే ఆబ్దికం పెట్టించేది. క్రితం సంవత్సరం వరకూ రవి ఈ విషయంలో ఆమె అభిప్రాయానికి ఎప్పుడూ వ్యతిరేకించలేదు. కాని నిన్నటిరోజు బ్రాహ్మణుని పిలవకుండా ఆ స్థానే మరొకరికి భోజనం పెట్టమనడం శాంతమ్మకు ఏమీ సంతృప్తిగా లేదు. కాని ఆవిషయంలో ఈమె వ్యతిరేకిస్తే విజయం ఎవరి పరమౌతుందో శాంతమ్మకు తెలుసు. అందుకే ఆమె ఏమీ మాట్లాడలేదు.

ధర్మయ్య మాత్రం ఆమె మానసిక సంశయాన్ని గుర్తించాడు. రవి చెప్పినదానిలో సత్యం లేకుండా పోలేదనీ, ఈపద్ధతికూడా చాలా మంచిదేననీ ఆమెను ఒప్పించి, కొంతగా సంశయ నివృత్తిని చేశాడు.

నాలుగు పదిగంటలకల్లా అరవై ఏళ్ళు పైదాటిన సుబ్బయ్య ధర్మయ్య ఆహ్వానం మీద వచ్చి కూచున్నాడు. అతను కూడా ద్విజద్వేషి కావడంవల్ల, రవి విధానాన్ని అభినందిస్తూ, వంద సంవత్సరాలు బ్రతకమని దీవించి, సుష్టుగా భోజనంచేసి వెళ్ళిపోయాడు.

ఆరోజు శాంతమ్మ భోజనం చేయదు. రవికూడా సాయంత్రం ఫలహారంమట్టుకే తీసుకోవాలని శాంతమ్మ ఆదేశం. తిండికోసం బాధపడుతున్నా - రవి మాటు ఒక్కటూనే ఆ నియమాన్ని ఆచరించడానికి నిర్ణయించుకున్నాడు. ఆరోజు పనిలోకి వెళ్ళకుండా చావిట్లో మంచంమీద కూర్చొని ఏదో పాత పుస్తకం చదువుతున్నాడు. అంతకుముందే ధర్మయ్య వీధిలోకి వెళ్ళాడు. శాంతమ్మ లోపలనుంచి వచ్చిన అలికిడి విని రవి తల పైకెత్తాడు.

"రాముతో నిన్నను ఏమన్నా మాట్లాడేవా?" అని అడిగింది.

రవి ఆశ్చర్యంగా చూశాడు. ఈ సంగతి తల్లికి ఎలా తెలిసిందా అని ఆలోచిస్తున్నాడు.

"నిన్న నేను వెళ్ళినతర్వాత రాము వచ్చాడా?"

"లేదే."

"మరి నేను అక్కడకు వెళ్ళినట్లు నీకెలా తెలుసు."

శాంతమ్మకు రవి వెళ్ళినసంగతి అసలు తెలీదు. అయితే రవి ప్రవర్తన మొదటి నుంచీ తెలుసున్న శాంతమ్మ, రవి మోటార్ సైకి లెక్కి జమిందారు యింటవైపునకు పోనివ్వడం చూసి బహుశా కడుపులో దాగిన కష్టాన్ని కడుక్కోడానికి రాము దగ్గరకే వెళుతున్నాడని ఆమె అనుకుంది. అందుకే అలా అడిగింది.

"వెళ్ళిఉంటావని అనుకొని అడిగాను... ఒక్కసారి..." ఆమె మాట పూర్తి గాకుండానే, సమాధానం సక్రమంగా రావాలనే కోరికతో ప్రాధేయతగా చూసింది.

పుస్తకం మంచంమీద గిరాటువేసి విసుగ్గా లేచి "నే నంత చేతకానివాణ్ని కాను. ఎందుకు వెళ్ళాలి మళ్ళీ?" తీవ్రంగా చూస్తూ అడిగాడు.

ఈ హఠాత్తుతో దానికి ఆధారం ఏమిటో శాంతమ్మకు అంతుపట్టలేదు. కొన్నిపాలాగే చూసి "ఫలహారానికి పిలిస్తే బావుంటుందని" మృదువుగా చెప్పింది.

"ఎందుకు పిలవాలి?"

ఎందుకు పిలవాలో శాంతమ్మకు తెలుసు. ఆ సంగతి రవికి తెలవాలని ఆమె కోరిక కాదు. కాని ఈరోజు రాముకూడా పిత్రు పరమయ్య ఫలహారంలో భాగస్థుడయితే, శాంతమ్మ హృదయం ఎంత ఆనందపూరితమౌతుందో రవికేం తెలుసు?

"స్నేహితుడు కాబట్టి" మెల్లగా సమాధాన మిచ్చింది.

"పేదవాళ్ళకు గొప్పవాళ్ళకూ ఎక్కడా పొత్తులేదమ్మా" అన్నాడు.

"అదేమిటి" విస్మయపూరితంగా ధ్వనించిందా కంఠం.

"అబద్ధం కాదమ్మా! ధనికులు పేదవాళ్లను చాలా తేలిగ్గా చూస్తారు... లేకపోతే నిన్న వెళ్ళి..." ఇంకా ఏదో చెప్పాలనే ఉద్దేశమున్నా - తాను పడ్డ ప్రాధేయత తన అభిమతానికి భిన్నమైనది కావడం ద్వారా ఏర్పడ్డ మానసిక క్లేశంతో ఇక మాట్లాడలేదు. వెలుపలకు వెళ్లిపోయాడు.

శాంతమ్మ రవి అసంపూర్తి మాటల్లో దాగిన పరిపూర్తి అర్థాన్ని గ్రహించుకోలేకపోయినా, ఏదో జరిగి ఉంటుందని మాత్రం ఊహించుకుంది. గుమ్మందిగి వెళుతున్న రవిని చూస్తూ అలాగేనిలబడి ఉంది శాంతమ్మ.

పళ్లెంలో పూలు వేసుకువచ్చిన లక్ష్మి శాంతమ్మ వెనక నిలబడి వెళ్ళేరవిని చూస్తూ "ఎక్కడికి వెళుతున్నాడు బావ" అని అడిగింది.

శాంతమ్మ వెనక్కి తిరిగి చూసింది. కాని ఏమీ సమాధాన మివ్వలేదు. వచ్చే సమాధానంకోసం కూడా లక్ష్మి చూడలేదు. చేతిలోపళ్లెం బల్లమీదపెడుతూ "కొన్నిన్ని పూలే దొరికాయి" అంది.

"ఒక పని చేసి పెట్టావాలక్ష్మీ" అని ఆతురతగా అడిగిన శాంతమ్మ కేసి, లక్ష్మి విస్మయంగా చూసింది.

ఈ రోజు అప్రమానం ఒక పసేకాదు. ఇల్లు అలకడందగ్గర్నుంచి, విగతుడైన చౌదరి ఛాయాచిత్రం దగ్గర ఉంచవలసిన పూలవరకూ కనీసం పది పనులైనా చేసి ఉంటుంది లక్ష్మి.

"ఇక నేను ఎక్కడికీ వెళ్ళలేను బాబూ" అంటూ వెళ్ళి మంచంమీద కూర్చుంది.

"మా అమ్మ కదూ"

శాంతమ్మ లక్ష్మిప్రక్కనా కూర్చొని లాలనగా అంది.

"ఏమిటాపని" కొస్త విసుగ్గా లలాటం చిట్లించి అడిగింది.

"రాముని ఫలహారానికి రమ్మనాలి" ఈమాట చాలా మెల్లగా అని అటూయిటూ ఒక్కసారి చూసింది. లక్ష్మి సిగ్గుగా తల వంచుకుంది. ఆ'రాము' అనే పేరుద్వారా పొందిన అనుభూతి శాంతమ్మ గుర్తించే స్థితిలో లేదు. "ఏం లక్ష్మీ"మళ్ళీ హెచ్చరించింది.

"నేను వెళ్ళను బాబూ."

"సరే-" నిస్పృహగా నిట్టూర్చి శాంతమ్మ లేచింది. లక్ష్మి తలవంచుకొని తనలో నవ్వుకొంటూంది.

"రాము అంటే ఎందుకూ మీ యిద్దరికీ అంతకష్టం" గుమ్మంలోకి వెళ్ళబోతూ వెనక్కితిరిగి శాంతమ్మ ప్రశ్నించింది. ఈ మాటతో లక్ష్మి భయంగా శాంతమ్మ కేసి చూసింది.

శాంతమ్మ ప్రశాంతవదనంలో, ఏదో తీరని ఆరాటం లక్ష్మిచూసింది. మెల్లగా లేచింది- "మా కష్టంమాట అటుంచు, రాము అంటే నీ కింత యిష్టమెందుకూ?" అని అడిగింది లక్ష్మి.

లక్ష్మి ఈలాంటి ప్రశ్న వేయగలదని శాంతమ్మ ఊహించుకోలేదు. చిన్నవయస్సులోఉన్న లక్ష్మిముందు తన ఆంతర్యం ఎక్కడ వ్యక్తమౌతుందో నన్న అదురుతో తప్పుకు వెళ్ళి పోవలసిన పరిస్థితి వస్తుందని ఆమె అనుకోలేదు. బలంలేని చిన్ననవ్వు నవ్వి శాంతమ్మ లోపలకు వెళ్ళిపోయింది.

"నేను నవ్వుతూ అన్నాలే అత్తా! రాము అంటే ఎవ్వరికీ కష్టంలేదు...?" అంటూ సిగ్గుగా పమిట మలిపెట్టుకుంటూ "నేను వెళ్ళి చెబితే బావుంటుందా... ఏమనుకుంటాడో"-అంది.

యుక్తవయస్సులో ఉన్న లక్ష్మికి యీ పని పురమాయించడంలో ఉండే భారం శాంతమ్మకు ఇప్పుడు అర్థమైంది.

"ఎందుకూ కబురు పెట్టేరట"

ఈమాట విని లక్ష్మి శాంతమ్మ వీధి గుమ్మంవైపు చూశారు. రాము గుమ్మం దగ్గర నిలబడి ఉన్నాడు.

"రా బాబూ లోపలకు రా" వచ్చే ఆనం దాన్ని అదుముకుంటూ ఆహ్వానించింది శాంతమ్మ.

రాము లోపలకు వచ్చాడు. లక్ష్మి గది లోకి వెళ్ళి తలుపుప్రక్కను నిలబడింది.

"ఎవరు చెప్పారు" అని అడిగింది శాంతమ్మ. రాము తలుపుచాటునుంచి కని పిస్తోన్న లక్ష్మి పమిటకేసి చూస్తూఉండ టంవల్ల వెంటనే ఈమాటను అర్థంచేసుకో లేకపోయాడు. కొన్నేపటికి "ఆ - ఇంకె వరు రవే" అంటూ, జేబులో సిగరెట్టు పెట్టె తీశాడు.

"ఇప్పుడే వస్తా" అంటో శాంతమ్మ లోపలకు వెళ్లింది. రాము సిగరెట్టు తీశాడు. "లక్ష్మి" అని మధురంగా పిలచాడు.

తిరుగు సమాధానం రాలేదుగాని, తలుపు రెక్క కదిలింది.

"అగ్గిపెట్టె" అన్నాడు.

లక్ష్మి తలుపుప్రక్కనుంచి మెల్లగా లోపలకువెళ్ళి అగ్గిపెట్టె తీసుకవచ్చింది. కొస్త దూరంగా ఉండి గిరాటు వేసింది. మంచం క్రిందుగా పడింది. రాము కొస్త కష్టంగా చూశాడు. "నిర్లక్ష్యంగా యిచ్చేది ఏదైనా నాకక్కర్లేదు" అని మొగం వీధి వేపునకు పెట్టాడు.

లక్ష్మి మెల్లగా నవ్వుకొని, క్రిందపడిన అగ్గిపెట్టె తీసి "ఇదిగో" అని సన్నగా అంది.

చేయి చాపుతూ క్రీగంటగా చూస్తూ "ముందే ఈ మర్యాద కాపాడుకుంటే" అంటూ అందుకున్నాడు.

"సిగరెట్లు తీయగా ఉంటాయా ?"

"తీయగాఉంటే కాల్చడ మెందుకూ ?"

"ఏమిటే దాని రుచి!"

"అర్థం కాదులే -" ఒక అగ్గిపుల్లగీసి అంటించాడు. సిగరెట్టుపొగ నిర్లక్ష్యంగా విడిచాడు.

"అనుభవించినదాని ఫలితం..."

"నువ్వే చెప్పు"-దర్జాగా కాలు ఊగిస్తూ అడిగాడు.

"గుండె జబ్బటగా" కొస్త భయంగా మొగంపెట్టి అడిగింది. ఆమె మొగంచూసిన రాముకు నవ్వొచ్చింది.

"ఆ జబ్బు అనుభవించేది నేనేగా."

ఈ మాటకు లక్ష్మి మొగంలో మార్పు వచ్చింది. "అలవాటు మాన్పుకోలేవా ?" ఆమె మాటలో తీవ్రతకు రాము ఆశ్చర్య పడ్డాడు.

"నామీద నీకింత శ్రద్ధ ఎందుకూ ?"

ఈమాటకు ఆమె సమాధానం చెప్పలేక పోయింది. ఆమె మొగంలో సిగ్గురేఖలు రాము స్పష్టంగా చూడగలిగాడు.

"సరే ప్రయత్నిస్తాను" అంటూ కాల్చే సిగరెట్టు వీధివేపునకు విసిరేడు. "అయితే పూర్తిగా మానగలనని హామీ యివ్వలేను సుమా - నీ కిష్టంలేనిపని నీ ఎదురుగా మాత్రం చేయను" అన్నాడు.

"కాదు. మానడమే చాలా మంచిది" అంది లక్ష్మి. 'ఏమిటో ఈ అధికారం' అనుకున్నాడు రాము మనస్సులో, పైకి మాత్రం "చెప్పడం సులభమే" అన్నాడు.

తరువాత మాట మనస్సులోనే లక్ష్మి పూర్తిచేసుకుంది. చేయడంమాత్రం ఎందుకు కష్టమో ఆమెకు అర్థంకాలేదు. కొన్నేపు నిశ్శబ్దంగా లక్ష్మికేసి చూస్తూ వుండిపో యాడు రాము. ఆమె వంచినతలను కొస్త ప్రక్కగా త్రిప్పి రాము కళ్లకేసి చూసింది. ఆ కళ్ళల్లో కనిపించిన ఏదో కాంతి ఆమె హృదయాన్ని పులకింపచేసింది. ఒక్క సారి కంపించింది. కదలి గదిలోకి వెళ్ళ బోయింది.

రాము లేచి ఆమె చేయి పట్టుకొని "మాట" అన్నాడు. ఆమె వెనక్కి తిరిగి చూసింది. "రామూ" అధికారంతోకూడిన తీవ్రమైన ధ్వనితో ఆమాట నిండివుంది. రాము వెంటనే చేయి విడచిపెట్టాడు. ఆమె గదిలోకి వెళ్ళిపోయింది. తాను చేసిన పొరపాటునకు వెంటనే నాలుక కరుచు కొని మంచంమీద చతికిల బడ్డాడు రాము.

తరువాత శాంతమ్మ తీసుకువచ్చిన ఫల హారాన్ని రాము ఆప్యాయంగా ఆరగించ లేకపోయాడు. అన్యమనస్కంగా కొంచం మాత్రమే తినగలిగాడు.

శాంతమ్మ అతని వైఖరిని ఆశ్చర్యంగా చూస్తూ "ఏం బాబూ విడచిపెట్టావ్" అని అడిగింది.

"అబ్బే! ఇంతకముందే తిన్నా-" అంటూలేచాడు. ఆ తిన్నవస్తువు ఏమిటో శాంతమ్మకు తెలీదు.

లక్ష్మి అప్పుడే కాఫీ తీసుకువచ్చింది.

"కాఫీ" శాంతమ్మ లక్ష్మిచేతిలో గ్లాసు తీసుకోబోతూ అంది. రాము ఒకసారి లక్ష్మి కేసి చూశాడు. కాని ఎక్కువసేపు చూడ లేకపోయాడు. "అక్కర్లేదమ్మా వెళతాను" అని మళ్ళీ వెనక్కి తిరిగి చూడకుండా రాము వీధిలోకి వెళ్ళాడు.

లక్ష్మిచేతిలో గ్లాసు అలాగే ఉండి పోయింది. వెనకనుంచి వచ్చే రవిని కూడా రాము చూడలేదు. రవి చావిట్లోకి వచ్చాడు. టిఫిన్, లక్ష్మిచేతిలో కాఫీచూశాడు.

"ఒంట్లో బావోలేనట్లుంది" అంది శాంతమ్మ.

"వాడు నిద్రపోతున్న ప్పుడు పెళ్లాన్ని తిడ తాడురా?"

"ఎవరు నిద్రపోతు న్నప్పుడు; వాడా, వాడి పెళ్లామా?"

"వాళ్ళు తినే తిండిలో ఇదో లెక్కా" అన్నాడు రవి. లక్ష్మిమాత్రం ఏమీమాట్లాడ లేదు.

"ఇట్లా యివ్వు" రవి లక్ష్మిచేతిలో గ్లాసు తీసుకున్నాడు.

"తాగేవాళ్ళు లేకపోతే బాధపడాలి" అంటూ గ్లాసు నోటిదగ్గర పెట్టుకోబోయాడు రవి.

"బుద్ధి ఉందాలేదా?" అన్న తల్లిమాట విని తాగబోయేగ్లాసును క్రిందకు దింపాడు.

శాంతమ్మ రవి చేతిలో గ్లాసుఅందుకొని "రాత్రివరకూ ఏమీ ముట్టకూడదని తెలీదూ ?" అంది. రవి మాట్లాడకుండా మంచంమీద కూర్చున్నాడు.

లక్ష్మి నవ్వింది. ఆ నవ్వులో ఏదో తృప్తి ఉంది. రవి లక్ష్మికేసి కోపంగా చూశాడు. "నీకు నవ్వుగానే ఉంటుంది" అన్నాడు. ఆకలి అతని కళ్లలో స్ఫురించింది.

"నీగురించి నవ్వలేదులే" అంటూ లోప లకు వెళ్లింది లక్ష్మి.

ఎవరిగురించి నవ్విందో శాంతమ్మ అర్థం చేసుకోడానికి ప్రయత్నించలేదు.

(ఇంకావుంది)

## గ్రంథ స్వీకారము

**బ్రతుకు బాటలు:**—విప్లవ గేయ కావ్యసంపుటి; రచయిత శ్రీ కొత్తపల్లి రంగారావు. ప్రతులకు "అరుణోదయ ప్రచురణలు, అమృతలూరు పోస్టు, గుంటూరు జిల్లా" అను చిరునామాకు వ్రాయ వలెను. వెల 0-8-0.

**దోపిడి :**—సాంఘిక నాటకము; రచయిత: శ్రీ సీతంరాజు వెంకటేశ్వర వురా. ప్రతులకు "రాజ్యలక్ష్మి బుక్ డిపో, ఇస్లాంపేట, విజయవాడ-1" చిరునామాకు వ్రాయవలెను. వెల 1-0-0.

# ★ అగ్నిప్రమాదాలు ★

నెల్లూరులో →



కృష్ణా జిల్లా తేలప్రోలు: అగ్నిప్రమాదం అనంతరం.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madra




చ ప్రి యా రి లీ జ్.